ఆం. పరిషత్తుశాఖ, వనపర్తి.
ప్రచురణము 1.

# ఆశాలత

(సాంఘిక నవల)

రచయిత:

ఏ. యజ్ఞరామయ్య

సోల్ ఏజెంట్:

చిట్టా వెంకట్రామశాస్త్రి

47ర8, మార్కెట్ వీధి, సికింద్రాబాదు, దక్కన్.

1947

 [ వెల ఓ. శ. 1—0—0

# తొలి పలుకులు

లత యలముకొనుటకు సమయముపడిన శాఖోపశాఖలై వ్యాప్తి గాంచును. ఆదిలో లభించిన యాశ్రయమునేగూడి నానా రకములుగా మొగబ్రాకుట గూడా గలదు. ఆశాలతలోని యాశకు లతపోకడలు గలిగియుండును.

మోహపాశమున జిక్కిన మొగవారలు, ఆశాలతలను దాల్చిన యాడవారలు, నాగరికతకు అలవడిన నిపుణుల చరిత్రలే యిందు గలవు.

**రచయిత**

# ఆశాలత



శంకరం——

ఏమి బాబయ్యా——

కాయితము కలము తీసుకరా?

మంచిది బాబయ్యా! ఇప్పుడే తెస్తా!

ఒక్కపరుగునపోయి శంకరం వ్రాతసామాగ్రిని తెచ్చెను. కృష్ణారావేదో యాలోచన చేయుచుండ, కొంత తడవాగి——

బాబయ్యా తీసుకోరేం!

హాఁ——

చేత కలముబూని టేబుల్పై తెల్లకాయితము జూచి తనలో

"తెల్లకాగితము నలగ యూరక చేయుట యన్యాయము. వ్రాసినదానిలో కొంత ఫలమైన యుండవలయును. ఏమివ్రాయుదు? ప్రేమలేఖ వ్రాయుదును! ఎవ్వరికి వ్రాయుదు? ప్రియురాలొక్కరై యుంటేగా! అవసరములేదు. "ప్రేమలేఖ" మాసపత్రిక యున్నదిగా. అందులో నావంటివారే వ్రాసియుంటారు. లేఖ మొదలిడడానికి ప్రియురాలి పేరు? ఇరుగు పొరుగువారి యెవ్వరిపేరైన ముప్పే- క్రొత్తపేరా! "ప్రేమమాల" వ్రాస్తే బాగుండును. ఈ పల్లెటూరిలో యీపేరెవ్వరికి లేదు. వేశ్యలకుండిన యుండును. దానివలన మనకు తగాదానే యుండదు.

ప్రేమలేఖకు ప్రేమమాల సరియగు నాయకురాలు. నాయకు రాలిని రంగముపై నాడించురీతి యేదో—సరే— చూస్తాను.

ప్రేమనగరము,
8 11-1946.

ప్రియ ప్రేమమాలా!

నా హృదయమున నీపేరు "ప్రేమ" యను పదమొక్కటే! హృదయమున యుండు భావమే వ్రాయునపుడు గనబడును. ప్రేమ యయాచితముగ నొకరినుండి లభించునని నా యనుభవము తెలుపుచున్నది. కాకున్న నీవందు- నేనిందు- మన యిరువురకు ప్రేమ గలుగుటకు కారణము? ఎప్పుడో చిన్నతనమున యొక్కసారి పరస్పరము చూచుకొని యుంటిమి. ఇప్పుడు మన హృదయములలో పరస్పర స్వరూపాలు ఇమిడి యుండుట యాశ్చర్యముగాదా! ఎందుకుండగూడదు? మనము పెంచిన ప్రేమవృక్ష ఫలము మన మనుభవించక వేరొండు బొందిన సహించగలమా! నీ ఆ మెఱుపుతీగెలవంటి కన్నులు- ఆ కల కోయిల కూతలబోలు నీ తేనె లుట్టిపడు పలుకులు- ఆ తను లావణ్య విలాసములు నేను పినా మెవ్వరనుభవించి యానందించ యోగ్యులు! ప్రియురాలు లోకోత్తరమై యుండవలయునని నా యాశయము. అందులకే నా లేఖనము పైవర్ణనను వ్రాసినది. సహజ సౌందర్యాన్ని యతిశయించి వ్రాయుట నీకు గిట్టదని నాకు తెలియును. కాని నేనుమాత్ర మేమిచేయగలను? నా హృదయమున కూర్చొనియుండు నీ యా లావణ్య స్వరూపమే నన్నీ విధముగ వ్రాయించినది.

ఎందు వ్రాయదలచిన యుత్తరము కాదు. కాని ప్రియురాలికి వ్రాయు ప్రేమలేఖకు భావముల కొరతగల్గునా! అతియు జీర్ణము. అందులకే యిప్పుడు విరమించుచున్నాను.

ఇట్లు,
కృష్ణారావు.

వ్రాయుట ముగియును. చదివినదానినే పదేపదే చదువును. ఉత్తరమును మడచి కవరునందుంచబోవును. మనస్సొప్పక తీసి మరల చదువును. దానిని తదేకదృష్టితో చూచును. తనలో "నా ప్రేమలేఖను బంధించవలయునా? నేను బంధించ జాలను. నా ప్రేమ బంధింపబడదు. స్వాతంత్ర్యము నా ప్రేమకు గలదు" అని తలచి,

శంకరం దీన్ని పోస్టుచేసిరా? ఆడుతూపోక జాగ్రత్త-

(ఇంతలో గిరీశం వచ్చి)

కృష్ణారావు నేడు చాలా యానందముగ గనుపించుచున్నాడు. ఎందునుండైనా యుద్యోగమునకు పిలుపు వచ్చినదా?

మనలనెవ్వరు రమ్మంటారు? మన బ్రతుకంతా "ఉద్యోగం, ఉద్యోగం" అని యలమటించ వలసినదే! మనకెక్కడిదా వ్రాత!

నీవొక వింతమనిషివి. నీ భావాలే వేరు. నీవే కవివైయుండిన యెంత బాగుండేది! ఏదో కష్టపడి చదివినావు- ఉద్యోగమా యింతవరకు దొరకలేదు.

సరే నీమాటనే యాచరించుదు.

శంకరంకిచ్చిన యుత్తర మెక్కడను?

ఎక్కడకు లేదు.

అయితే కవరుపై చిరునామము వ్రాయలేదా? అది యెక్కడా చేరక తిరిగి నీకడకే వచ్చును. వింతయే నీ మాట! శంకరం ఉత్తరమెద్ది?

పోనిమ్ము, వేళయింది.

చిరునామము చూతాము. మిత్రుడెంతదూరము ప్రయాణము చేయదలచినాడో-

ఇదిగో బాబయ్య!

"ఎడిటర్ ప్రేమలేఖ" పట్టక పట్టక గొప్పదనినే పట్టినావే. చిన్నకథ వ్రాసినావా?

కాదు.

మరి- అంత రహస్యమా?

కాదు - చిన్నలేఖ.

లేఖ- ఒక్కసారైనా చూపించలేకపోయ్యావా! నీ స్నేహితునేగా! నీ యానందాన్ని పంచుకొనే యధికారము నాకు లేదా? నమ్మకద్రోహము చేయుచున్నావన్నమాట.

అబ్బా! ఇంత చిన్నతప్పుకే! ఇప్పుడేమి మించిపోయినది!

ఐందేదో మైంది. దానితో నాకిప్పు డేమవసరము? మాసపత్రికలో చూస్తానుగా! (లేచి) నమస్తే!

పోతావా?

గాకుండానే పోతానా- పదేపదే వస్తూంటానుగా!

నీవు కృష్ణన్వు నేను గిరీశం యంతేకాని ఆత్మలొక్కటే.

గిరీశం, శంకరం వెళ్ళిపోదురు. ఒంటరిగ కుర్చీలో పడును. ఆయనను మించిన కోరికలు, తరంగాలు గంతులేస్తున్నాయి తలలో. ఆలోచన మేదీ తెగక యందుండి లేచి వాకిలికడ కొచ్చును. తిరిగి పోయి కుర్చీలో యుస్సురనుచు వ్రాలును. తనలో "ఈరోజు ప్రేమలేఖ ప్రయాణమగును. మరునాటికి మద్రాసు చేరును. ఎడిటరుచూచి ప్రకటించడా! బాగా లేకుం టేగా ప్రకటించక పోవడము? వచ్చే మాసపత్రికలలో ఎందరు స్త్రీలు చూతురో! ప్రేమమాల యనుపేరు చూచేవారి కెవ్వరి కైన యుండదా! ఆమె నాలేఖ చదువనో లేక చించి పార వేయునో! ఆపేరు గలవారు తమపేరు పెక్కండ్రకు గలవని యెఱుంగరా? ఒకరిపేరు వేరొకని కుండదా! ప్రేమలేఖలు వ్రాసే వారుండిన నన్ను గౌరవించరా! అంతెందుకు? కొత్తపోకడలతో వ్రాయమనిగూడా ప్రార్థింతురు. నేను తప్పక వారి కోరికల పాలించవలదా!

ఏమైనను లాభములేదు. వెధవాదాయము మనము చది విన విద్యకు సంపాదన మిదియేనా? గౌరవమైన యుద్యోగము చేసి సుఖసంసారము గడపక వృథా కాలయాపన చేయవలసిన దేనా? అది లభించేదాక మన నైపుణ్యా మిందుమూలముననైన మన స్నేహితులకు చూపెదము" అని తలచుచుండును. తటా లున వాకిలి శబ్దమగును. దిగ్భ్రమతో శంకరంను చూచును.

శంకరం కాఫీ పట్టుకరా?

ఇప్పుడెక్కడిది బాబయ్యా!

హోటల్. బడలికగాయున్నది- త్వరగా తే?

అని చెప్పి తనలో "ఇప్పుడే మెదడు వేడైనది. వేడికాఫీ తాగుట మంచిదా? మంచిదే "ఉష్ణేన ఉష్ణం శీతలం" అన్నారు గదా! రెండు కలసిన నాకు చలువదనం గలుగును. అప్పుడైన మనోతాపము తగ్గును." అని తలచి యేమీ తోచక యందుండు పుస్తకముతీసి చదువనొల్లక తిరిగి యందే యుంచును. ఇంతలో శంకరం కాఫీ తెచ్చును. కృష్ణారావు మోము చిరునగవున తాండవించును. దిగ్విజయము పొందినవానిమాడ్కి వాని యాకారము మారును. మనసు సంతోషమును భరించలేక చేతులమూలమున ముందుకు నడుచును. ప్రియురాలిని కౌగిలించుకో బోతున్నానంత తొందర చేతులలో గనబడుచుండెను. కాఫీనుండి వెడలు గుండ్రని యావిరి స్వరూపము ప్రియురాలి హృదయతాపమని తలచును. నీ తాపాన్ని తీర్ప ప్రియుడిని యుండ నీకేమిభయమన్నటుల మెల్లగ సమీపమునకు గైకొనును. ఆ చషకము తన మోవి తగిలినవెంటనే యతని సంతోషము మితిమీరెను. అందుండునదియే యధరసుధారస మనుకొనును. అంతశక్తి దానిలో లేనిదే దానిపై లోకమింత వ్యామోహము చూపునా! ఒక్క త్రేపుతో తన తాపమును పోవిడుచును. శంకరం కప్పును తీసుకొని పరుగెత్తును. తన వస్తువేదో పోయినవానిమాడ్కి తదేక దృష్టితో కృష్ణరావు వానిగాంచును. పోతే కావలసినప్పుడు రాదా యనునటుల మేను విరుచును. పాపము నాటి యతని చేష్టలు వింతపోకడలో యుండెను. ముందు తాజేయు ఘన కార్యముల యాలోచనా తరంగములు పున్నమనాటి సముద్ర తరంగములమాడ్కి విజృంభించు చుండెను. ఆ విజృంభణ

మొత్తిడికి మనోగట్టులు తాళజాలకుండెను. ప్రతిక్షణము ప్రతి చోట వాటిని స్మరించటమే యతని కర్తవ్య మయ్యెను.

౨

కృష్ణన్! కృష్ణన్" అని పిలుపువిని,

ఎవ్వరు? లోపలరండు.

నమస్తే!

ఓ! ఓ! గిరిగారా! చాలాకాలమునుండి అగపడలేదే!

ఊర లేను.

ఎక్కడకు వెళ్ళియుంటివి? నాతో చెప్పకే వెళ్ళావా? స్నేహితుడవంటె నీవే స్నేహితుడవు!

ప్రారంభించావు ఎత్తిపొడుపు.

హా- హా- మీరునేర్పిన విద్యయే నీరజాక్షు...

తులాభార నాటకాన్ని బాగా చదివావన్నమాట!

నీవంటివా రెప్పుడైన యనగా విన్నవే! అదియటుండని- వెళ్ళినచోటి విశేషాలుకానీ- మన పాతరామాయణము సదా యుండునదే.

ఎవ్వరితో చెప్ప వీలులేకుండానే మద్రాసు ప్రయాణము తగిలెను. ఇంట్లోవారికగూడ తెలియదు. ఉద్యోగము మన మేమిచేస్తాము. ఎందు పొమన్న పోవలసినదే. ఉద్యోగము లభించేదాకానే సంతోషము- లభించినతరువాత వీడుటకే బుద్ధి. వేరే యాదరువు లేనప్పుడు దేవుడు చెప్పినటుల వారియాజ్ఞ శిరసావ

హించ వలసినదే. కాదన్ననూ తిలోదకాలు వదలవలసినదే. నౌకరీ లభించుట సులభము. దానిని నిలుపుకొనుట కష్టము.

రోజొక ధోరణి నీది- మొన్నటిదాక యుద్యోగమే పురుష లక్షణ మనేవాడవు. నేడు దానిపై యసూయ చూపుచున్నావు.

అది నీకు బోధించితేమాత్రము మనస్సుకొస్తుందా! అనుభవము కావాలి. ఆ పాడుదేవుడు ఆ మంచిచూపు నీపై యొక్క సారి చూచినగదా! నౌకరిలోని మజా బోధపడేది- ఒక కవి "పరుల చాకిరికన్న మడి దున్నుక బ్రతుకవచ్చు మేదిని" అని యన్నాడు.

ఎవ్వరో యన్నారని నీ వంటున్నావా? అందఱు నీరీతి ప్రచారము చేసిన "యుద్యోగి యవసరము, యుద్యోగి అవసరము" అని ప్రతిగోడపై కెక్కకుండెనా!

అది నిజమే. జీవించుటకుగూడా అవసరమేగా! కష్టపడి సుఖజీవనము చేయు స్వాతంత్ర్యము లేనప్పుడు తలచి లాభము? కార్మికరాజ్యమైతేగా క్రొత్తక్రొత్త వస్తునిర్మాణ యత్నము గావించుటకు! మన దేశమున స్వాతంత్ర్యులనే కార్మికులకు పెక్కు పెనుభూతాలు వెన్నంటి యున్నవి. వారుకూడా బోనులోని యెలుకలె.

అయితే మన యంగగతి- నౌకరి లభించిన తినుట, లేకుండిన పస్తుండవలసినదేనా?

మనలో చైతన్యము గలుగునందాక నీవన్నదే. మనము మనమా యని యాలోచన చేయునంతవరకు మనమింతే. మన

మెందున్నాము, దేనిని చూచుచున్నాము, దేనియందు వసించుచున్నామని తలచి బానిస కారాగారమును త్రోయును. ప్రాణము పోయినవా డేమిచేయగలడు? తన దుఃఖభాజనమైన జీవితాన్ని త్రోయుటకన్న, బానిసజీవికి, సౌఖ్యము, ఆనందము, పురోభివృద్ధి, చైతన్యము గలుగునా! ఎందుకు గలుగును. వారల భాషనలె తలయొగ్గి చరించుట, పరులకై యాత్మత్యాగమె తలకు తట్టదు.

గిరి! నీది రోజాపై పదము.(*)

కృష్ణన్! నీకొక వింతనె.

అనుభవించిన తరువాతనే యనుకొనేది.

వద్దు బాబూ నీవంత నిషేధించిన నాసితో నాకేమిపని? అది యెటుండని మద్రాసు పోతివిగదా!

అంతేగాదు "ప్రేమలేఖ" ఆఫీసునకు పోయియుంటిని.

నా లేఖ ప్రసంగము వచ్చినదా?

రాదా! సామాన్యమైనదై తేగా! లేఖ మెచ్చినాదన్నాడు. వైరీతిని వ్రాయుమ సహాయపడమని వ్రాయాలనిగూడా యను కున్నాడు. ప్రథమముననే నీలేఖ ప్రకటించబడినది. ప్రయత్నము మాత్రము బాగా ఫలించినది. (లేచి) నమస్తే (వెళ్ళి పోవును.)

(కృష్ణారావు తనలో) గిరీశం సుఖ సందేశాన్ని తెచ్చినాడు. మర్యాద జరుపుట ధర్మము. ఏమైందో యిప్పుడీ యాలోచన- స్నేహితుడేగా! ఏమనుకుంటాడు?

ఇంతలో పోష్టుమ్యాన్ అగపడును. దిగ్గునలేచి ద్వారమున నిలచి-

వచ్చుచున్నాడు. నా ప్రేమలేఖ గైకొని. నారీతి యెందఱి యాదరాన్ని గలిగి మెలుగుచున్నాడో! వాడే ధన్యుడు. ఏ మహారాజునకైన దాని నెదురుచూచునటుల చూతురా? వాడు బీద కష్టజీవి. కాని వాడు మాలాంటి వారితో కలిసినప్పుడు వాని మోమున గనబడు చిరునగవును వర్ణించ తరమా! మన మెందుండిన వెతకుచు మన సందేశాలను తెచ్చు యత్యంత ప్రియస్నేహితుడు గాడా? స్నేహితుడు పరమాప్తుడు. వాడే నిరూపించుచున్నాడు. కష్ట సమయములలో, సుఖసమయమందును మనలను దర్శించి వార్తల నిచ్చువాడు వీడేగా! "తెప్పలుగ చెఱువునిండిన కప్పలు పదివేలు జేరు" అను సామెత యీ బీదజీవికడ కానరాదు. తనకొకింతయు మనవలసి లాభము లేకుండినను తలచుగ సంతోషపరుచు చుండునుగాదా! ప్రతిఫలమైన కోరుట శంకించును. చేసిన మేలునకు ప్రతిఫలము ఆశించువాడు స్నేహితుడా! అని తలచుచుండ వాడు ప్రేమలేఖ నిచ్చెను. తాను సంతోషమున చూచుచుండెను. పైపుటను త్రిప్ప ప్రయత్నము చేయునుగాని పేరుపైయుండు దృష్టులు గదలుటలేదు. చూచును. [illegible]సులో నొక్కసారి "ప్రేమలేఖ" యని తల[illegible]. [illegible] చును. [illegible] యెంత [illegible]మృత [illegible] అందు ఏ [illegible] త్త [illegible] సౌందర్య [illegible] దో [illegible] కన్నుల [illegible]కే [illegible] చుండెను. పెన్నిధి లభించినవా[illegible] ని హృదయము [illegible] తానందము జెందుచుండెను. [illegible]డు పోవుట దీని

ముగ జూచును. మరుక్షణమే తనచూపు ఆ దివ్య యక్షరములపై వ్రాలును. ఆ పేరు ల మనిషే యది వ్రాయుండిన యేమి చేసే వాడో! అంత యందులోనుండు సుధారసము వాలుచూపుల నాళములతో త్రాగును. అతని కన్నుల కంతటను దివ్య యక్షరములే యగపడును - ఎందుజూచిన ప్రేమజ్యోతులే యగుపడు చుండెను. చేతిలోయుండు పత్రిక సుధాన్విత కాంచన చషకము గోచరించును. ఒక చేతిచే పట్టుకొనిన క్రింద బడునను భయంబున నోలె రెండుచేతు లుపయోగించును. మెల్లగ కుర్చీపై వ్రాలును. ముఖపత్రను మార్చును- గుండ్రని యక్కరముల "ప్రేమమాల" యను అక్షరములు గోచరించును. మెల్లగా యా పత్రికను టేబుల్పైనుంచి యాపేజీని త్రిప్పును. అందును ప్రేమ లేఖలే! త్వరత్వరగా పేజీలను చూచును. అంతటా ప్రేమలేఖలే. ప్రియురాలు ప్రియునికి, ప్రియుడు ప్రియురాలకు వ్రాసిన లేఖలే. ఒకటొకటి యొకరకము- ఒక్కొక్కదానిలో నొక్కొక్కపద్ధతి- ఒక్కలేఖ కృష్ణరావు దృష్టిలో వ్రాలును.

అనురాగపురము,

ప్రియమనోహర్, 4-12-46.

జీవితములో సుఖదుఃఖము లనుభవించుట తప్పదు. ఆనంద విచారములు పరస్పర సంబంధములు. వెలుగు చీకటిని గలిగియుండును. పగలున్నచోటనే రాత్రులుండును. వెలుగును సౌఖ్యము దుఃఖమును చీకటిగ పోల్చుట సరికాదు,

ఎడబాటు సహించరాని వేదన. కాని యావేదన వలననే పరస్పర హృదయ నిక్షిప్త యనురాగము వృద్ధిబొందుట గూడా గలదు. సమీపమున నుండి సౌఖ్యానంద నావాయానము జేయుచు విహార దుఃఖముల బారద్రోలి లోకోత్తరమైన యనురాగ సుధారసమును గాన సుధారసములో కలిపి జీవయాత్రలో యూహలను గావించుకొనుచు, రయమున, నిశ్చలతో ప్రశాంతముగా పయనించు ప్రేమికులకు నెడతెరపివలన గలిగిన భావ పరివర్తన గలుగునా!

ఎంత ప్రశాంత ప్రదేశమైనను కోలాహలమునకు తావగుచున్నది. ఎంత గభీరస్థలమైనను సంచలనమునకు చోటగుచున్నది. నిరంతరాటవి పక్షులవలన నేమగును? గంభీరాంబుధి పెనుగాలివలన మొరశజెందును. ఇవియన్నియు గలిగిన పరిణామ మేమగునో పరికించగలమా! సదా యల్లకల్లోలములచే నిండిన ప్రదేశమున కోలాహలము పెనుగాలి యున్న దానిని నాశన పరచజాలవు- రెండింతలు జేయును.

ప్రేమ యొకరిసొమ్ము గాదు ఒకరు గ్రహీతలు- ఒకరు దాతలు గారు. కోరక యేలభించు యమరసుధ కోరినను కంటమా కాలకూటమును బంధించ దలచినను బంధింపబడని యపారము- బంధించ దలచకుండినను బంధనములజిక్కు సూక్ష్మము.

ముగింపు మనస్సు వాంఛించదు. కాని దేనికైనను పరిమితి యుండును గదా—

ఇట్లు,
సుశీల.

చదివిన తరువాత కృష్ణారావు తనలో,

హా! హా! ఏమి యామె భావగాంభీర్యము- ప్రతియక్షర మమూల్యము. పవిత్రప్రేమ నిరూపణములో నామె యెంతటి యుదాత్త గుణములు చిత్రించినది- ఇది యామె యనుభవమై యుండును. వేరొండు యాచకులు నామెకుండుట, కొందఱు చోరులామె ధనమును సంగ్రహించ గోరుట, ఆమె మహా భాగ్యవంతురాలు. ఆ మహాభాగ్యము వేరొండుచే బడసినదా! కాదు- యాచకులు, చోరులు గలిగియుండుటచే తన ధనమును పోగొట్టుకొనక భద్రపఱచుకొని యుండును. ఆమె ధన్యజీవి. ఆమె యాశయములే పవిత్రములు. ఆమె యనుభవము పవిత్రమైనది. పవిత్ర యాశయముల నొనరించువారే ధన్యులు- పవిత్ర యక్షరముల చదువువారే ధన్యులు- పవిత్ర మానవుని నామము వినువారే ధన్యులు.

కృష్ణారావు హృదయ మిప్పుడందు లేదు. ఎండుటాకు పెనుగాలిలో నెగిరిపోవుమాదిరి యెందో బోవుచుండెను. తన మేనిలో నేదో యమరజ్యోతి ప్రవేశించినదని సందేహించు చుండెను. కాని యెందుండి వచ్చినదో బోధపడకుండెను. అందుండి లేవబోవును గాని తలపై మోయనిభార మున్నట్టుల గోచరించినది. ఆ పత్రికను వదలదలచును గాని తన హస్తముకు దానిని బంధించినటుల తోచును. ఆ బంధనము లెవ్వియో యతనికి బోధపడలేదు. ఆ పత్రికనుండి తొలగ ప్రయత్నించును గాని తామరతూడ బంధపడలమాడ్కి-యే లతలో చుట్టుకొనుచుండెను. హృదయము పరిపరి విధముల పరుగిడుచుండెను. కాని అగాధ

మున తెరువు తెన్నూ లభించలేదు. మనస్సు స్వాధీనము లేదు. కన్నులు చూడని ప్రదేశములు చూచుచుండెను. చెవులలో నేదో ధ్వనించుచుండె- తను దేనినో స్పృశించునటుల తోచు చుండెను. అది యతని కానందమో, విచారమో యెరుగడు. ఏదియు తోచక యుస్సురనుచు వెలికిల కుర్చీలో వ్రాలును.

కిటికీగుండా చల్లటిగాలి వీచును. అందలి యే శక్తియో యతని యుద్రేకము రెట్టించెను. అంత తనలో-

అగ్నికి వాయువు మిత్రుడు. నాలో తాపము శమించ కుండా ప్రయత్నము చేయుచున్నాడు. ఈ దుష్టుని యణచ వలయును. కాని మహాబలుడు మానవశక్తి దైవశక్తిని నిరోధించగలదా! వాయువు కంటకకారియా! కాదు- సకలప్రాణుల జీవాధార వాహ్యాళికై బయలుదేరినప్పుడు శరీరమును స్పృశించి పారిపోవుచు మనోహ్లాదమును గలిగించునది గాదా! ఒక్కొకచో పాంథులు ప్రియా సమాగమమునకై వేచియుండ భీతిలేక యేకాంతమున యుండు జవరాలి చనుగుబ్బలతాకి మనోద్రేకము గలిగించి వారల ప్రియులకై పదలునుగదా! అంబుధముల నొక్క నుండి యొక్కచో గొనిపోవునది యీ మహాబలమేగా! వార్తా వాహకమిదియేగా- ఓ పవనమా! నా సందేశమును గైకొని పోదువా! ఎక్కడపోదువు? నీ సహాయ మవసరములేదు. నీ త్రిలోక సంచారత్వము నాకవసరము లేదు. నన్ను వదలి పొమ్ము- ఏల పోదువు? తపించుదానిని తపింపజేయుట నీ సహజ గుణము." అని తలచి మనసు దిట్టపరచుకొని యందుండి లేచును.

# 3

నిశాచరుడు గతించె మేల్కొనుడని రవి తన కిరణముల ప్రజల లేపుచుండెను. ప్రపంచమున నెలవు లస్థిరములని తెలుపుచు పక్షులు మింట నెగురుచుండెను. హాలికుల చిరుతన్నలు గోమాతల సేవ పరమ సేవయని ప్రజలకు తెలప వాటితో నడవుల కేగుచుండిరి. "పరోపకార మిదంశరీరం" అను వచస్థితి దెలుప కర్షకులు సృష్టికై బోనముకల్పించ చేలకేగుచుండిరి. ధనికవర్గము "ధనం మూలం ఇదమ్ జగత్" అని జపించుచు తమ హోమమునకై హవిస్సును జతకూర్చ మొదలిడదొడగిరి. సనాతన మతమునకు కట్టుబడి, జన్మహక్కులగు సౌఖ్యముల బారదోలి, యయాచితముగ లభించిన దురదృష్టమును మెడచుట్టుకొని, కళంకమను పెను భూతము నారాధించుచు, విషయాసక్తములు వీడి, రాత్రి పగలు పగయైనిలువ, దుఃఖభాజనమైన జీవయాత్రను గడుపుచు, విలపించి, తపించి, నశించు బాల వితంతువులు వేడికన్నీటిచే సూర్యున కర్ఘ్యమిడుచుండిరి.

కొందఱు బాలురు దినపత్రికలను, వారపత్రికలను, మాసపత్రికల నమ్ముటకై! వీధుల దిరుగుచుండిరి. ఒక కుఱ్ఱవాడు "ప్రేమలేఖ- నానారకములైన ముద్దులేఖలుగల పత్రిక" యని కేకవేయుచు పోవుచుండెను. పేరే యాకర్షణీయముగా యున్నదని ప్రేమపిపాసులు విరివిగా గొని స్వీయ యనుభవముల బోల్చి చూచుకొనుచుండిరి. కొందఱు మరచినవాటి స్మృదణకు తెచ్చుచున్నదని కోపమున కాల్చ నిచ్చగించియు తమ యనుభవముల తలచుచు జాగుసేయుచుండిరి. ఒక స్త్రీ వాకిటనిలిచి యొవరినో

యెదురుచూచుచుండెను. ఆమె ఆ పిల్లవానిని పిలిచి "ప్రేమలేఖ" గొని లోనికేగును. అప్పుడామె తనలో—.

ప్రేమలేఖ చూచిన యే పెనుగాలి వీచునో! అని తలచి మొదటిపేజీలోనే కృష్ణారావు లేఖను గాంచెను. దానిని జూచిన తోడనే యామె ముఖము పద్మమువలె వికసించెను. దొండపండు వంటి పెదవులపై చిరునగవు నాట్యము చేసెను. కొంతవరకు చదువ ప్రయత్నించెను గాని యేదో తలంపు ప్రథమ యక్షరము పైకే దృష్టిని లాగుకొని పోవుచుండెను. మనసు స్వాధీన పరచు కొని చదువ ప్రారంభించెను.

ప్రేమనగరము
12-1-47

ప్రియ ప్రేమమాలా,

సమ ప్రదేశమున నది ప్రవహించునప్పుడు హాయిగ, ప్రశాంతముగ, కన్నుల పండువుగ ప్రవహించును. అదే ప్రవాహము మిట్ట పల్లములు పారునప్పుడు హల్లకల్లోలములు పాలగును. ప్రవాహముపుట్టు ప్రదేశము నిష్కల్మషమై ప్రశాంతమై ప్రకాశించుచుండును కాని ప్రవహించుకొలది వైశాల్యమై మహాపర్వత సానువుల దాటుచు తుదకు సముద్రమున జేరునప్పుడు జనన మొందిన దానిలోనే యింకిపోవును. ప్రవాహము ఒక్కొకసారి పరిపూర్ణమై నిండుజీవంబును గలిగియుండును. ఒక్కొకసారి శుష్కించి చూచువారలకు నిరాశను గల్గించునదిగ నుండును. ప్రవాహము యొక్కచో పలుచనై, ఒకచో గంభీరమై ప్రవహించును.

ప్రేమయే ప్రవాహము, జీవంబు.

ప్రవాహమున కానకట్టకట్టి ప్రజలు తమ లాభమునకై వినియోగింతురు. అది విజృంభించునందాక కట్టకు భయము లేదు. బంధనమునకు అపాయము కాకుండ కాలువ తీయుదురు. నీటికి పోవు స్వాతంత్ర్యమియ్యక నిరోధించిన యడ్డు నిలుచునా! దైవసృష్టిని మానవ నిరోధము నిరోధించజాలదు.

ప్రతిజీవియు మనోహర దృశ్యమును, మనోహరమగు ప్రదేశమును గోరును. కామమునకు తారతమ్యమా! సకలప్రాణులను తన బానిసలగా జేసుకొనును. కామాతీతుడు లోకోత్తరుడంటారు. బానిస భావము లుండవనియేమో!

సంఘము, మతము మానవుని కామోద్రేకము అవినీతికి పాలుపడకుండా బంధించు బంధనము. కాని నేటి కొందఱి స్వార్థపరత్వమున యభాగ్యుల కాలపాశ మగుచున్నది. తమవిధి యనుకొనుచు దుఃఖించుచు నలవాటుకూడా యొక పేర్పడినది. చోరత్వముచేసి కారాగారము జెందుట విధియా! పసిపాపల వివాహములజరిపి వితంతువులైనవారివిధి పురాకృత కర్మమనుట భావ్యమా! మానవులు తమ సౌఖ్యదాయకమైన యొక పదార్థముగొని దానిని పోగొట్టుకొనినచో నిరాశ జెందియుండవలసినదేనా? తిరిగికొనుట నీచమా!

ఇట్లు
కృష్ణారావు

ముగింపునకై మనస్స్పందించుచుండును. హఠాత్తుగా యాగిపోయినదీ ప్రవాహము. అభాగినుల హృదయముల చిత్రించు నీ

కుంచియు సామాన్యమైనదికాదు. సుశీలా! నీకు కన్నులు గలిగి యుండినఫలము నేడు తీరినది. ఆ పవిత్రస్వరూపమును మనము చూచితిని.

అని తలచి చూచుకొలదికన్నీరు కాలువలై ప్రవహించ దొడగె. ఆ కన్నీరు చెక్కిళులను పదును చేయుచుండెను. ఆమె లోని విచారప్రవాహము లేఖాంబుదముచే విజృంభించెను. హస్తద్వయమున వారించ ప్రయత్నించును గాని శమించుట లేదు.

అక్కా! అక్కా! (మోహను పరుగెత్తుచు వచ్చి నిలుచును.

ఏంరా- మోహన్!

ఏడుస్తున్నావా!

లేదు- నానా!

ఏడుస్తూ లేదంటావా! ఏమన్నా బాధయుంటే మందు తేనా!... చెప్పవా!

పిచ్చినాన్నా! నాకేమీ బాధలేదు. నేను ఏడవలేదు.

ఆ కంట్లో నీరెందుకు. నాన్నతో చెప్తాను.

చిట్టినాన్నా! ఏమని చెప్పెదవు?

అక్కెందుకో యేడుస్తున్నది. అడుగుతే యేమీచెప్పదని.

అసత్యము చెప్పగూడదు.

నేనబద్ధము చెప్పుచున్నానా!

కాదా (లేచి చిరునగవున వడిలోకి లాగుకొనును)

అక్కా! (పైకిచూస్తూ) ఇప్పుడు నిన్ను ఏడుస్తావని యంటానా? కాటుకఇత్తువుపా?

ఇంతలో సుశీలతండ్రి చక్రిపాణి వచ్చును.

నాన్నా! తొందరగావచ్చారే.

నేడు కృష్ణారావు వస్తాడు. తొందరగా వంటచేయమని చెప్పడానికి వచ్చాను.

ఏ కృష్ణారావు?

మన పత్రికకు లేఖలు పంపుచుంటాడే- మనయాఫీసులోనే యుద్యోగ మియ్యాలనుకున్నాను. బి. ఏ. చదివినాడట. ఉద్యోగ మేదీ దొరకలేదట. నేను రమ్మని వ్రాసినాను. నేడు వస్తానని వ్రాసినాడు. స్టేషన్‌కుపోతాను.

అని తండ్రి వెళ్ళిపోవును. సుశీల వంటచేయ ప్రారంభించెను. నానారకములైన పదార్థముల చేయసంకల్పించెను. ఆ కొలది సమయముననే వంటకములు సిద్ధపరచు ధైర్యము నాటి సంతోషమే కారణము. సంతోషము మానవునేపనిచేయించ జాలదు. వంట సిద్ధమైయుండెను. మోహను త్వరపడుచుండెను.

అక్కా! నాన్న యింకారాలేదే.

వాటిని తినవలయునని తొందరపడుచున్నావుగదా?

సరి చేసిందెందుకు. ఎప్పుడొస్తాడో?

సుశీల వాకిలిదిశ చూచును. ఆమె చూపు లెవ్వరినో యాహ్వానించుటకై వాకిట వేచియుండెను. ఆమె భావములు వాకిలిముందర పరుగిడుచుండెను. చూచుచు నావిధముననే కొంతసేపు నిలుచును. మరుక్షణము సిగ్గుచే లోలోన యేమో

భావించి యవనతముఖియై ప్రక్కకు తొలగప్రయత్నించును. తొలగదు. ఆమెకాళ్ళు బంధింపబడినటులపోవ నిష్ఫలమగుచుండెను. వాకిటగుండా నీలాకాశము గనబడును. అందే యప్పుడొక సుందరాకార మగుపడును. గుఱ్ఱపుబండ్లు శబ్దముజేయుచు గుమ్మము దాటుచుండెను. కాని యవసరమగు బండి రాలేదు. ఒక్కబండి గుమ్మము దాటువరకు సుశీలహృదయ మొక్కసారి తిరుగుచుండెను. గడియారము టక్కుటక్కను శబ్దమామె శాంతమును భంగపరుచుచుండెను. ఒక్కొక్క నిముసము గంటగ దోచుచుండెను. ఒక్కసారి తలవాకిలి యొక్కవారి గడియారము చూచును.

రాలేదుగదా మోహన్!

లేదక్కా!

లేదనుశబ్దము సుశీల యెన్నోసార్లు వినియుండెను. కాని యప్పటియాధ్వని మోమున విన్నదనమును జేసెను. మహాబాధ గలిగినటుల సుశీల ముఖకమలము వాడెను. పదములు బాధగలిగించెడివని యామెకు తెలియకుండును.

సుశీల కొలదిసేపు దేవుని స్మరించును. ఎవ్వరో రమ్మనునటుల యామెకు వినబడును. అంతా శూన్యము. మోహన్‌వినా యెవ్వరు లేరని యొక్కసారి తలచును. నవ్వు పెదవులపై నాడించును. వెంటనే సిగ్గువచ్చి మందలించును. ఆమెలో నాశ నిరాశ వెంటవెంట మారుచుండెను. ఆశ యొక్కసారి ధైర్యము చూపును. నిరాశ నన్ను జయించినవారెవ్వరు లేరని యట్టు తగులును. ఆమెను రెండు శక్తులు తమ స్వాధీనముగావించుకొన

నలయునని యొకటిమించి యొకటి ప్రియత్నము చేయుచుం డెను. ఆమెచూపులు క్రొత్త ప్రపంచమును గాంచుచుండెను. ఆమె భావనులు వేరొక ప్రపంచమున తిరుగుచుండెను. ఆ ప్రపంచాన్ని యొక్కసారి తలచి యానందించును. ఈ ప్రపం చాన్ని యొక్కసారి తలచి ఖేదపడును. ఇంతలో:

అక్కా నాన్నవస్తున్నాడు.

అని విన్నతోడనే యామెయందు నిలవలేకపోయెను. ఆనందసాగర తరంగములొక్కసారి యుప్పొంగెను. కన్నులలో నొక్క నవీనకాంతి, పెదవులపై యొక్క దివ్యజ్యోతి ప్రకాశిం చెను. మేనెల్ల చెమటయొడెమె. పైటజారె. ఇంతలో తండ్రి మాత్రము వచ్చును. ఆమెకేమియు తోచలేదు. ఆమెయానందము స్తంభించె. ఇంతలో కృష్ణారావు వచ్చుట గాంచెను. అంత యామె హృదయము చంద్రోదయారంభ సాగరమయ్యె. కృష్ణా రావు ఇంట్లో ప్రవేశించెను. పెనుగాలి పోయినతరువాయి ప్రశాంతమే యామెలో గలిగె. మెల్లమెల్లగ ప్రక్కకు తొలగెను. ఏదో దివ్యజ్యోతి ప్రక్కకు తొలగుచున్నదని కృష్ణారావుకు తోచినదిగాని యేలకో చూడలేదు. ఇంతలో భోజనమునకై తండ్రిని పిలిచినధ్వని వినబడును. ఆ ధ్వనియే యామెదని తల చును. ఆ యింటి పరిశుభ్రత కృష్ణారావున కెంతో యానందము గొల్పినది. అందుండు చిత్తరువులలో నొక్కదానిపై తన దృష్టి నిలుచును. ఇంతలో:

బాబూ! మానాన్న భోజనానికి రమ్మన్నాడు.

నీ పేరబ్బాయి?

మోహన్.

చిరునగవుతో లోనికేగుదురు. నానారకములైన పదార్థములు వడ్డించబడియుండును. ముగ్గురుకలసి భోజనము చేయుచుందురు. అంత చక్రపాణి:- మావంట మీకు నచ్చకుండును.

బాగాయున్నవి. రుచిలో యొకటిమించినది వేరొకటి యున్నవి. నాకొరకింతమీరు శ్రమపడినారంటే నా మనస్సుకు చాలా బాధగాయున్నది.

మా సుశీల యతిథి వచ్చెననికూడా ఇంకా యెక్కువ చేయలేదు. ప్రతిరోజు పదార్థములే.

మీరు వృధాశ్రమ గలిగించినారు. ప్రేమతోనిడు పట్టెడన్నము చాలదా! వీటివలన నన్ను మీ ఋణస్థుని గావించినారు. అప్పుతీర్చు టెట్లో?

మీరానందమునొందుటే మా బాకీతీరుట. మీసంతృప్తియే మా ప్రతిఫలము. సుశీలా! ఆ పరమాన్నము వడ్డించు.

(సుశీల పరమాన్నము వేయును.)

వద్దండి. కడుపు నిండింది.

(సుశీల ఆగును)

మరి ఋణమేలా తీర్చుకుంటారు? మేముచేసిన పదార్థముల తినినగా ఋణస్థులు. అమ్మాయీ! వడ్డించు. క్రొత్త సిగ్గుకాబోలు.

(వడ్డించును)

చాలండి.

(చాలించక వేయుచుండ, ఒక్కసారి యామెవైపు

చూచును. ఆమె చాలించును.)

మేనేజరుగారూ! నేడు నన్ను చంపేశారండి. నాజన్మలో తిననంత తినిపించారు.

సుశీలను కనులారగ చూడవలయునని గోరునుగాని కన్నుల పైకి యెత్తజాలకుండెను. చూచిన తప్పుగ భావించరా యని మనస్సును దృఢపరుచుకొనుచు, వారన్యధా తలచిన మర్యాదకు నాశనము గలుగునని తలచును. చెడ్డభావములుంటేగా భయమని తలచును. ఆమె హృదయమెటువంటిదో యని సందేహించును. చూచి యానందపడవలయునని వాంఛించును. ఖేదపడుట గలుగునేమోయని సంశయించును. ప్రతిసందేహము నకు వ్యతిరేక సందేహమే-

భోజనముచేసి లేచును- ఒక్కసారి దృష్టిప్రసారము సుశీలపై బఱుపును. ఆమె చిరునగవున యవనతముఖియై యుండును. ఆమెపెట్టిన భోజన మమృతమయమని తలచును. అందుండి తొలగుట తప్పదుగదాయని తోచినవెంటనే మిన్ను బడినట్లగును. ఒక్కసారి విధిని దూరును. ఒక్కసారి వానిదయను నుతించును. ఒక్కసారి నిర్భాగ్యుడనని నిరాశ జెందును. ఒక్కసారి భాగ్య సంపన్నుడనని గర్వించును. అని చింతించుచు నొకగది ప్రవేశించును. కొలదిసేపుపూర్వమే కృష్ణారావు ఆగది చూచి యుండెను- కాని యది విచిత్రముగ గోచరించుచుండెను. ఇంతలో చక్రపాణి విడియము దెచ్చియిచ్చి కూర్చొనును-

మీ యతిధినగుటచే ధన్యుడను-

గొప్ప చేసి పొగడుచున్నారు.

నన్ను రమ్మన్న కారణము?

నేను వంటరిగానిని. తగిన సమర్థుడు లభించిన కార్య భారము కొంత తగ్గునని తలచుచున్నాను. మీ యుత్తరప్రభావమున ప్రతులు విరివిగా నమ్ముడుపోవుచున్నవి. మా యాఫీసునం దుద్యోగముపై నియమించదలచినాను. మీయభిప్రాయము?

సరే మీ యిష్టము. నాయిష్టమువచ్చినప్పుడు పోవ వీలగునా?

సర్వము మీ యధీనము. దీనిని బాగుపరచినను మీరే. నాశనపరచినను మీరే. పరుల యాచించి దాస్యవృత్తి గడుపుట కన్న స్వతంత్రుడవై యుంట యుచితమని నాతలంపు.

సరే. అద్దెకైన యిల్లు చూడండి.

మనయిల్లు యున్నదిగదా- మేముమాత్రముండేవార మెంతమంది. నేను, నా మోహాను, మా సుశీల.

మీ యల్లునినైన పిలిపించుకొనిన చేదోడుకాకుండునా?

(విచారమున) ఆ అదృష్టమా! సుశీల నిర్భాగ్యురాలు. బాలవితంతువు.

బాలవితంతువు. తెలిసినవారింట్లోనే యీ నిదర్శనమా!

ఏమిచెయ్యగలము. సుశీలతల్లి దీర్ఘరోగగ్రస్తురాలై బిడ్డ వివాహము కావలయునని బలవంతముచేయ వివాహము జరిగెను. కాని అదృష్టము మిగిలి యుండినగా- కష్టములు పైపైననే వచ్చునుగా! తల్లిమరణముతోడనే పతిమరణము వినినది బాలిక- పతిచనిపోతే నేమని యనేది- కమలము వికసించకముందే ముకు

శించినది. వయసు వృద్ధియగుకొలది తన స్వరూపము తేటపడినది. లోలోన విలపించును- ఏమిచేయగలదు-

మీ దుఃఖమును చూడజాలను- గతించినదానిని జ్ఞాపకము గల్గించి హృదయఖేదము గల్గించితిని-

పాపులము- పాపఫల మనుభవించుచున్నాను ఈ విచారమే నన్ను నాశన పరుచుచున్నది. ఈ విచారమే యకాల వృద్ధత్వము గల్పించినది.

విచారమున లాభము గల్గునా! కావలయునని కోరునారెవ్వ రుండరుగదా!

మీపై నాకు నమ్మకము గలదు. సమ్మతింతురా నిరాకరింతురా యను యనుమానమే నేటివరకు నాలస్యము గావించినది. మీ రెవ్వరినైన విచారించవలసి యున్నదా?

ఏమియు లేదు. మీరు ఇచ్చువారు నేను పుచ్చుకొనువాడను. మీ యుద్దేశ్యమును పూర్తి చేయగలనని నమ్మకముగా చెప్పగలను. సదసస్సుల యుద్దేశ్యము లాచరణీయములు. ఏ మూలభాగమునానో యున్న నన్ను ప్రపంచ మధ్యమునకు తెచ్చినమహాత్ములు.

నేడేగదా పర్వదినము!

అంతయు మీ యనుగ్రహము. గొప్పవార లెవ్వరినైన తమవారిగ నెంతురు. మణి తన చుట్టూ ఉండిన పదార్థములలో తనకాంతి గలదని నిరూపించదా! రవి యాకసమున యుండి పద్మముల వికసింపచేయడా! సుధాకరుడు తన వెలుగును పులుగుల కాహారముగ నొసగడా! సముద్రుడు ప్రాణులు జీవించు

టనై యంబుదముల పంపుటలేదా! వృక్షము లయాచితముగ ఫలముల నిచ్చుటలేదా! ఇవియన్నియు ప్రతిఫల మపేక్షించి నవా! ఉదారస్వభావుల హృదయములు విశాలములు.

ఆఫీసుకు వెళ్ళుదమా మోహన్?

ఏమి నాన్నా—

ఆఫీసునుండి నాల్గుగంటలకు వస్తామని యక్కతో చెప్పి-ఫలహారము సిద్ధపరచమని చెప్పుదునా?

(చిరునగవున) కాదు—

అయితే నేను చెప్పను. నా కేమిలాభము?

నీ కేమికావాలి? పో- చెప్పు పో!

హు—హు—(కాదన్నట్లు తలయూచును)

నీ యిష్టమువచ్చినటుల చెప్పు పో!

ఏమండీ- మీ అబ్బాయి చాలా తుంటరి.

గారాబముతో పెంచినందులకు వాడేగా నా యానందము. వాని సౌఖ్యమే నా సౌఖ్యము.

అవును! పుత్రుల సౌఖ్యముకన్న పితరుల కేమికావలసి యుండును- పుత్రవిహీనుడు, విఫలవృక్షము, జీవంబులేని కొలను, వాసనలేని పువ్వు, జ్యోతిలేని దివ్వెయు, సుస్వనములేని వీణియ.

సమర్థుడు లభించెనుగదా యని చక్రపాణి హృదయము సంతోషమున తాండవించెను. యిద్దరు ఆఫీసుకు వెళ్ళిపోయిరి.

చక్రపాణి తన ఆఫీసులో పనిచేయువార లందరిని పిలువనంపును. వారందరితో

నా భుజభారము నేటినుండి కృష్ణారావు ధరించును. ఈయనే మీకుగొప్ప. మీరందరు వీరిలేఖలను చదివియేయున్నారు. మన యదృష్టం ఫలించినది కాబట్టి మనమిదు స్వల్పమునకీ రాజ్య భారము మోయ సమ్మతించినాడు.

అంత కృష్ణరావు కార్యాలయము నంతయు నొక్కసారి తిరిగి వచ్చెను. తనలో

"భాషాసేవ ముద్రణాలయమువలన నపార మగుచున్నది. ఒక్కరు వ్రాసినదానిని యొకేసారి వేలు చదువుదురు గదా! ప్రకృతిలోని రహస్యముల ప్రకటించి ప్రపంచమునకు మేలుకూర్చు ప్రకృత శాస్త్రజ్ఞులు ధన్యజీవులు" అని తలచుచు కుర్చీపై కూర్చొనెను. గోడపై వ్రేలాడగట్టిన గడియారము తన దిగ్విజయము సాగించుచుండెను. ఎందరెన్ని విధముల విశ్రాంతి గైకొనదలచినను తానుమాత్రము విధి నిర్వహణయందు లీనమై యుండెను. సూర్యుడు ప్రాక్కునుండి పశ్చిమమునకు దిగ జారుచుండెను. తాప మతిశయించి తగ్గుచుండెను. రవి గమనము త్వరగైనటుల గోచరించుచుండెను గాని యా మహాత్ముని గతిలో నేమాత్రము మార్పు గలుగకుండెను. గడియారమున నాలుగంటల శబ్దమునకై కృష్ణరావు నిరీక్షించు చుండెను. ఇంతలో చక్రపాణి పిలుచుటచే వారిరువురు గృహము చేరుదురు. గడపలో కాలుపెట్టడముతోడనే తన కెవరో యెదురు చూచుచున్నటుల గోచరించును. అప్పుడు మోహను-

నాన్నా! ఆలశ్యము చేశారేమి?

ఏమీలేదే!

అక్క మీకొరకు ఎంతసే పెదురుచూచినదో తెలుసా! చేసిన "ఉప్మా" చల్లబడినది.

అందులకా నీ హడావిడి- నీవు తినలేదా?

నేను తిన్నా! నేను తినకుంటె మరెవ్వరు తింటారు? అక్క నాకు పెట్టకుండా ఉంటుందా!

(కృష్ణరావు చిరునగవున) మీయక్క చాలా మంచిది గాదూ!

హాఁ! మంచిది. ఏమినాన్నా అక్క మంచిదిగాదూ? మంచిది-

నాన్నా అక్కతో చెప్పుతా మీ రొచ్చారని?

తొందరగా! మాకుగూడా ఫలహారము తెచ్చిపెట్టు.

అంత కృష్ణరావు తనలో "చిరపరిచితులు కాకున్నను ఈ కుటుంబముచూపు నాదరణ ప్రశంసనీయము. వీరలు తమ యాప్తునిగా చూచుచున్నారు. ఎవ్వరిని జూచినను సదాస్మిత వదనులు. వీరు ధనికులు గాకున్నను ఆనందసంపద వీరలకు గలదు. కలిగినదానినే గొప్పగా భావించి సంతసించుట యీ ప్రేమకుటుంబము యొక్క అమూల్యాదర్శము" అని తలచుచుండ సుశీల ఫలహారము తెచ్చియుంచెను. కృష్ణరావు తినుచు,

మీ అమ్మాయి వంటలో నేర్పరి.

విశేష నైపుణ్యమేమియు లేదు.

మీకావిధముగనే యుండును. తినగ తినగ గారెలు చేదు గదా! మీరేమీ అనుకోకుంటే మీ అమ్మాయిచేయు పదార్థములు

ఆ దేవతలైనా చూచిన యమృతకలశము వీడవలసినదే! వారల కంత యదృష్టమెక్కడిది? వంటల వల్లభుడు వీటిచవి జూచిన సిగ్గుపడవలసినదే——

(మోహన్ పరుగెత్తివచ్చి) నాన్నా మనమీరోజు సినీమాకు పోవాలి.

కొత్తసినీమాలేవీ లేవు- ఏమీవద్దు.

హాఁ—హాఁ—(కాదన్నట్లు) అది కానేకాదు. ఈరోజు అక్క తప్పక పిలుచుకపోతానన్నది నీవొద్దంటే అక్క వింటుందా?

(కృష్ణరావు) నీకేమర్థమౌతుంది?

హాఁ' బొమ్మలు, గుఱ్ఱాలు, రైళ్ళు, మోటార్లు రావా! చూస్తుంటే యెంత తమాషాగా ఉంటుంది- నీవెప్పుడూ చూడ లేదా? నీవు వస్తావా? మా అక్కకు చెపుతా నిన్ను తీసుకపొమ్మని.

నేనురాను.

ఏమి నాన్నా రానంటాడు- ఇంట్లో వంటరిగా వదలి పోవలసినదేనా? (కృష్ణరావునుజూచి) మేమందరము పోతే నీవు వంటరిగ వుండవలసినదే!

ఉంటాను. నాకేమిభయము-

భయములేదా (ఆశ్చర్యముగ) దయ్యాలెత్తుకపోతాయి.

మీయింట్లో దయ్యాలుంటాయా?

మేమందరమూ ఉంటే ఉండవు. ఇంట్లో పిల్లలేడ్చిన పట్టుకుంటాయి.

నీతో నెవ్వరు చెప్పారు- అంతా అబద్ధం.

అబద్ధమా? మాయక్క అబద్ధం చెప్పుతుందా- ఏమి నాన్నా?

ఏమిచెప్పదు మోహన్—

మరి- ఈయన—నిన్ను పట్టుకొంటేగాని నీకు తెలియదు.

నిన్ను భయపెట్టడానికి చెప్పింది మీ అక్కయ్య.

నన్నెందుకు భయపెట్టాలి?

మొండివై యేడుస్తుంటే- —

నేనేమి యేడుస్తానా నాన్నా- (కృష్ణరావునుచూచి) నేనేమి చిన్నపిల్లవానినా? నన్నెవరు కొడతారు ఏడవడానికి?

అయితే దయ్యాన్ని నెప్పుడైనా చూచినావా?

హు—హు—(లేదన్నట్లు తలయూచును)

మీఅక్క నీతో అబద్ధము చెప్పినది.

మళ్ళీ ఆబద్ధం చెప్పిందంటావా? అక్కను అడిగి వస్తాను.

అని మోహను పరుగెత్తును. బాలుని ముద్దుపలుకులు కృష్ణరావును ముగ్ధుని చేసెను. వానిమాటలు నెప్పటికిని విన వలయుననియే కోరుచుండెను. సుశీల వారి సంవాదము ప్రక్క గదినుండి వినుచుండెను. ఆమె సంతోషమునకు మేరలేదు. తను స్వర్గసీమలో నివసించుచున్నానని తలచును. తాను పోగొట్టు కొనిన వస్తువు లభించినదని తలచును, కాని మరుక్షణమే నొసటి కుంకుమ స్మరణకొచ్చును. ఆమెయానంద మొక్కసారి యంత

మొందును. మహాసముద్రమున యుండు భ్రమణమున జిక్కువాని మాడ్కి యామె తల్లడమందును. తన ప్రాణమే నిరర్థకమని నిందించుకొనును. తన నాసక్తిజ్వాలని తృప్తి జెందును. కాని యామె తాపాగ్ని శమించునదిగాదు. పాప మేమిచేయును? ఏకాంతమున విలపించును. తన కన్నీటిచే కొంగంతయు తడి గావించును. తనలోని తాపాగ్నితో దానిని యారవేయును. తన దుఃఖము తండ్రికి తెలిసిన ఖేదపడునని తాను తనదుఃఖమును దిగమింగును. ప్రజలకు తాను సంతోషముగా యున్నదానిగా తోపజేసినను తండ్రినిమాత్రము సంతోషపరచ జాలకుండెను. తండ్రి, కూతురు తమలోని దుఃఖము పరస్పరము తెలియకుండ దిగమ్రింగుచుండిరి. మోహను పరుగెత్తుచు వచ్చి—

అక్కా సినీమాకురావూ, ఏడుస్తున్నావేం?

ఏమీ లేదు—

అందరూ సినీమాకు బయలుదేరుదురు. చక్రపాణి కృష్ణరావుతో రిక్షాలోపోదామా అని యడుగును. అంత కృష్ణరావు,

చక్రపాణిగారూ- నన్నొకయనుమానము చాలాకాలము నుండి బాధించుచున్నది.

అంత గొప్పసందేహమా?

సామాన్యమైనదే. మానవుని మానవుడు మోయుటయా? నాగరికతకది కళంకముగాదా? బానిస దేశములోయుండి బానిసలమై బానిస వృత్తివలన తృప్తి జాలక మనసోదరులను మనమే యీ హీనవృత్తి యవలంబించ ప్రోద్బలపరచు చున్నామంటే

బానిసభావములు మనలో కొరత లేదనుటకు నిదర్శనమా- బానిసకు స్వాతంత్ర్యము జన్మహక్కు కాగలదా? తన జానెడు పొట్టకై నిర్భాగ్యుడు బండిలాగుచు పోవుచుంటే ఆయాసము వలన గలిగిన వేడినిట్టూర్పులు భాగ్యవంతులకు తాళవృంతము యొక్క యనిలముగ స్పృశించునేమో- బానిసకు బానిస యా కష్టజీవి. సృష్టిలో యుత్తములు మానవులు. ఈ నీచకార్యమునకు తోడు, ప్రజ్ఞాధురంధరులు, శాస్త్రవేత్తలు, నాగరికత చే గర్వించిన పిశాచములు. హీనులు, జాత్యాభిమాన శూన్యులు, గలుగజేసుకొనుచున్నారు. నేటి యుదారభావము లివియేనా? జన్మతో లభించిన యంగములు, ఆత్మ తనవి, తనవి గానప్పుడు జన్మహక్కు స్వాతంత్ర్య మేవిధమగును?

కృష్ణరావ్రూ నీధోరణి వేరు. ఈ దేశములో పుట్టినందులకు నీజన్మ నిరర్థకం. నీ వుద్దేశ్యములు నీలో నశించవలసినదే. చెలమనీరందే యింకిపోవుట గలదు. నీటిని ఉపయోగపరుచుకొనువార లుండినసే నీరూరుట సంభవించును.

ఇంతలో రిక్షావాడు వచ్చి "రిక్షా కావలయునా" అని యడుగును.

(కృష్ణరావు) వలదుబాబూ—

వాడు దీనముగా చూచుచు త్వరగా గాలిని. పీల్చుచు నిలబడును.

వలదన్నానుగా—నిలబడినావెందులకు?

స్వామీ మీ యిష్టమొచ్చినంత యివ్వండి. ఈరోజు కాస్త కూడా దొరకలేదు. బండియజమానికియ్యవలసిన రూక లెట్లి య్యగలను? బీదవానిని- మీరెక్కడకు పొమ్మంటే అక్కడికే పోతాను.

ప్రతిరోజూ యజమానికెంత యిచ్చెదవు?

ఒకటిన్నర రూపాయలు.

మరి- నీకెంత ఆదాయముంది?

ఒకపూట గంజికి సరిపోనిది- ఈ యెండుబొక్కలు, మడతల శరీరమే మా యాదాయము.

పాపం—ఇవిగో రెండురూపాయలు.

బాబు—ఎక్కడకుపోతారు? (సంతోషం)

ఎక్కడకూలేదు- నీవు వెళ్ళిపో—

ఈ రూపాయలు నాకెందు కిచ్చారు?

ఈరోజు నీవియ్యవలసినదిచ్చి, మిగిలినదానితో కడుపు నింపుకో—

కష్టపడకుండా మేము సంపాదించిన దేమీలేదు. దీని వలన మాకడుపుగూడా నిండదు- వలదు.

(విచారము) సాయంత్రం కావచ్చినది. ఇంకా యెక్కడకు తిరుగుదువు?

నాపై మీకు దయవుంటే నాకేదైనా పని చూపించండి. ఆ తరువాత మీదయ.

వాని నమ్రత, వాని దీనత్వము, కృష్ణారావునకు పెద్ద చిక్కు గలుగజేసెను. ఏది చెప్పుటకు సాహసించలేదు. అంత వాడు దీనముగా "బాబూ" అని యడుగును. కృష్ణారావునకు మిక్కిలి కోపము గలిగెను. కాని వాని దీనస్వరూపము శాంతము గలుగజేసెను. వాని జీవితముపై విచారించును. దైవమును నిందించును. నాగరికతను తూలనాడును. విధిలేక వానితో-

ఈ గోజెక్కడకు పోను. రేపుదయమురా-

అని యనిన వాడు నమస్కారముచేసి పోవును. ఏమరకతో కృష్ణారావు వాడగుపడుదాకా చూచుచు నిలుచును. అంత సుశీల-

నాన్నా! గుఱ్ఱపుబండి పిలుచుక రాకూడదా?

కృష్ణారావు ధ్యానమంతయు నొక్కుమ్మడి భగ్నమయ్యెను. తన చేష్టలకు వారు వేసరిక జెందియుందురని తలచును. ఇంతలో గుఱ్ఱముబండి రాగా వారు సినీమాకు పోదురు.

౫

గిరీశం తన గదిలో కూర్చొని దేనినో యాలోచించుచుండును. నా డాదివారము- తన మిత్రులను తలచుటకు వీలు గలిగినది. కృష్ణారావు చిత్రపటము చూచి-

పోయి సుమారు రెండుమాసాలైనదే! కాని వాని విశేషాలేవీ తెలియలేదు. పత్రికాలయము పనిమాత్రము దొరకినదట. తరువాతి విశేషాలేమీ తెలుపలేదు. మరచిపోయినాడో! లేక పల్లెటూరువానితో నేమిస్నేహమని విరమించుకున్నాడా! ఒక్కసారి వానిని కదలించి పరీక్షించెద.

అని తలచి కృష్ణారావుకు ఉత్తరము వ్రాసి యోచించు చుండును. అంత తల్లి యుత్తర మొకదానినిచ్చి చదువమనను. ఆ యుత్తరముచూచి విచారమున "అమ్మా! నీవు చదువుకోలేవా?

ఏమిరా! మామగారి యుత్తరము కాలసర్పమా! వారు నీకేమి ద్రోహము చేసినారు? చదివి వినిపించు.

విశేషాలేమీ లేవు. అంతా బాగా ఉన్నారు. తెలిసిందా! ఇంక పో—

అంతమాత్రము నాకు తెలియదా! ఈ రెండక్షరాల కొరకు ఇంత యుత్తర మేల?

నాకు తల నొప్పిగా ఉంది. తీసుకొనిపో. ఇంక యెవ్వరి తోనైన చదివించుకో—

ఇంట్లో బావి పెట్టుకొని నీటికి యూరిబయటకు పోయిన ట్లున్నది. నీ కేమిదయ్యము పట్టినదిరా!

చేతగాదంటే బలవంత మెందుకు?

(కోపమున) బలవంతము- చదివితే తెలివి తేటలు గలుగు నంటారు- ఇవియే కాబోలు! తల్లి సరిపడదు- తండ్రి కంటికి కానరాడు- ఈ పాడుచదువు వలదంటే విన్నారా వారు? ఇప్పు డనుభవించాలి.

దేనికీ యుపన్యాసము- నోటికొచ్చినటుల గొణిగితే లాభము?

చిన్నవారలను పెద్దల జేయుటే గలుగు ఫలము చీవాట్లు.

అయితే, నీవు చెప్పే దేమిటి? ఇప్పుడు కాళ్ళకు పూజ చేయుమంటావా?

నీ కెందుకంతశ్రమ. ఈ ముదుసలి వయస్సున నిన్ను బాధించుట దేనికి? నేడుకాకున్న రేపైన పోవువారలము- సత్పుత్రుని గన్నందుకు ఫలము గలుగుచున్నది.

అయిందా ఉపన్యాసము? ఇంకా యేమైనా మిగిలినదా? ఏవో నెపముపెట్టి నిందించడముతప్ప నీకేమీ తోచదు. పెద్ద మనిషివైనావు- కోపమెక్కువైనది- చదివితేగాని పీడ తెగదు. ఏది-

ఎందుకులే- భార్య వ్రాచుపాము. అందుండి వచ్చిన యుత్తరము విషతుల్యము. నేటికాలము భార్యలను వదలమని బోధించునేమో! ఛాయా అందకత్తెగాదా? విద్యరాదా! సంగీతమురాదా! ఏమిలోటుగలదని వదలినావు?

ఆ వర్ణనవలన యిప్పుడవసరము?

కోడలి నెప్పుడు పిలుచుకవత్తువని! ఇంట్లో ఛాయ తిరుగుచుంటే కండ్లార చూచుటకు! వివాహము చేయుట తప్పిదమా;

అంత యిష్టముంటే తీసుకురాకూడదా! నాముందర వచ్చి యేడుస్తే లాభము? మీ యిష్టప్రకారము పెండ్లి చేసినారు మీ యిష్టప్రకారము పిలుచుకరండి!

పిల్లల పెండ్లిండ్లు తల్లిదండ్రుల యిష్టప్రకారము జరుగుట తప్పా! అంతమాత్రమున భార్యను దూరముంచవలసిన దేనా? పెండ్లిసమయమున చేయు ప్రతిజ్ఞ యిదియేనా! మేము చేయునది మీకొరకేనా?

అనవసరముగ దుఃఖించి బాధపడకు. మీరే యజమానులు. మీ రేమిచేస్తే వద్దంటాను?'

మేము చేయడానికి అడ్డురాలేదు. చేసినలాభ మేదీ? ఇక్కడ నీవు, అక్కడ ఛాయ కుమిలిపోవుట చూడగలమా? మా ప్రయత్న మిరువురికి కాలపాశ మైనప్పుడు మేము చేసినది గొప్పనా?

అయితే నీకు కావలసిన దేది?

అడుగుచున్నావా (కన్నీరు తుడుచుకొనుచు) తల్లిదండ్రులు బిడ్డలవలన యే ప్రయోజనము పొందగోరుదురు? ఒక వృక్షమునాటి దోహదముచే పెద్దదానిని చేయుట యెందులకు? పెరిగి పెద్దదై, ఫలించి ప్రకాశించుటకు గాదా! తెలిసినదా మా వాంఛ?

నా ఆనందాన్ని వాంఛించువారు నా హృదయాన్ని యేల తెలుసుకోలేదు? నా యాత్మకు వ్యతిరేకించినదానిని యనుసరించమన్న సమ్మతించుటెట్లు? నాకు వ్యతిరేక మగుదానిని మీరు చేయునప్పు డూరక యుండుటవలన గలిగిన ఫలము. మీపై గౌరవముంచిన ఫలము- బలవంతముపై మనసు మారదు.

మారదు- మానవుడవనియే యనుకున్నాము. పరుల యాచారాలు నమ్మిన నీకు సహజమే. పాషండులు గూడా ప్రపంచమున యుందురు.

ఇంతలో నొక సేవకుడువచ్చి తల్లిని పిలుచుక పోవును. గిరీశం తనలో

జడివాన వెలసినది. ఈ యిల్లు నాకు రోజురోజు నరక కూప మగుచున్నది. ఈ యుద్యోగమే లేకుండిన అమాంతముగ

తొలగిరి నా విమలను జేరి యుండకుందునా! నావిధి నాకు సుఖము లేదు. నా సౌఖ్యమే విమల- విమల నన్ను మరచునా! మరవదు. తాను మరచిపోవునదైన నాతో నన్నిసార్లు ప్రతిజ్ఞ చేయించుకొనునా! ఆ సముద్ర తరంగములనుండి వచ్చు చల్లటి గాలిలో భరతనాట్యము చేసిన మా హృదయనటన మరవగలమా! వసంతోత్సవములు జరుపుచు ప్రపంచమున యుండే యానందాన్నంతా సంగ్రహించి యనుభవించజాలకపోయి, యాకాశముపై, భూమిపై వెదజల్లిన దృశ్యములు మరపునకు వచ్చునా- పూసెజ్జలపై పసుండి మధురాలాపము లాడుచుండ మలయ పవనుడు మామధ్యన వచ్చి మమ్ముల వేరుపరచదలచినవానిని పొగడి మావానిగ జేసుకొనిన యా నైపుణ్యముల మరుతుమా! వనవాటికలలో విలాసమున పాడుచుండ కోయిలలు విద్య నేర్చుకొనుటకు వచ్చుచుండు వింతల వీడగలమా! తేనెలుట్టిపడు పలుకుల గోలిన చెవులు వేరొండు పలుకుల వినగలవా! విమలా! లోకోత్తర సౌందర్యరాసి చూడదలచి నిన్ను బ్రహ్మ సృష్టించినాడు. లేకుండిన యే కళంకములేక యట్లుందువా! నీయంగ యష్టియే నిదర్శనము గాదా! నీవు మరచినను నేను మరువగలనా! నీవు నన్ను మోసము చేయజాలవని నా యంతరాత్మ ప్రబోధించుచున్నది.

అని తలచుచుండ నౌకరు ఉత్తరము తెచ్చి ఇచ్చును. ప్రియురాలి లేఖగ తోచును. సంతోషమున త్వరగా చదువును. "విమల నన్ను మరువదు. నేను ధన్యుడను- తన యానందాన్ని పంచుకొను హక్కు నాకే గలదని వ్రాసినది. ఏమి నాపైనుండు

నపార ప్రేమ- పరస్పర సమ్మతినిగన్న యనురాగమే లోకోత్తరమైనదిగా! విమలా నిన్నెప్పుడు చూతును- నిన్ను రమ్మని వ్రాసిన నీవు వచ్చెదవు. కాని తల్లిదండ్రులు మండిపడరా? నీ నామముననే సంతోష పడవలసినదేనా! నీ ముఖారవిందము చూచు భాగ్యము లేదా? నీ హృదయముగూడా యెంత విమలమైనది! చందన పరిమళము మలయమారుతము వినా యెవ్వరు ధరించి రాణించగలరు- చంద్రుని సుధారసము చక్రవాకములు తప్ప యే పక్షులు త్రాగి యానందించగలవు. మఱి యెవ్వరికడయుండిన ప్రకాశించును- నీకై తపించు నన్ను విమలా శాంతి పరచవా......

౬

సుధాకరుడు పూర్ణకాంతిని ప్రపంచముపై వెదజల్లుచు తనవలన యానందించువా రెవ్వరూ లేరని మోముపై చేయుయుంచుకొని విలపించుచుండెను. చంద్రుని కళంక మదియే- శరదృతువు- అప్పుడప్పుడు మేఘములు చంద్రుని విచారము నగుపడకుండా చేసెను. ఏ తరగతివారలకు వారే స్నేహితులగుచుందురందురు. తమభావిని తలచి విచారించువారే వెన్నెల వాంఛించుచుండిరి. గాలి దొంగతనముగా కిటికీగుండా లోపల ప్రవేశించునప్పటి శబ్దమే వినబడుచుండెను. కాని యా గాలి దొంగతనమును పట్టుటకై కొందరభాగినులు కాచికొనియుండిరి. అప్పుడప్పుడు వారు వెలుపలకొచ్చి యంతట చూచుచుండిరి. ఒక్కచోట నిశ్శబ్దము- ఒక్కచో విలాపము. వారల చూచు

టకై చంద్రుడు నడియాకాశమును జేరుచుండెను. ఆ తెల్లటి పండువెన్నెలలో నొక స్త్రీ కన్నీరు కాలువలై కారఁ విలపించుచుండెను.

ఓ ప్రభూ! నేను నీ బిడ్డను గానా- నీకు నాపై కాఠిన్యమునకు కారణమేది- నేనేలోపము గావించితిని. నిష్కారణముగా బిడ్డలను బాధించుట పితరుల ధర్మమా! తండ్రి నా తప్పును విచారించ నవసరముమే లేదా! తల్లిదండ్రుల మించిన దెద్దియు ప్రపంచమున లేదని లోకులందురు గాదే! అది యిందులకేనా! నేనంత దోషకార్యములు చేసిన పాపినైన పుట్టుకతోడనే నేల యసువుల తీయవైతివి? ఇది పూర్వజన్మ ఫలమా! స్వామీ! ఎంత దోషినైనను చెరసాలయం దుంచుటకు పరిమితిలేదా! ఈ దీను రాలి దీనాలాపములు రాగాలాపము లగుచున్నవా! దేవా నన్ను రక్షించలేవా- నీకిష్టముండకుండిన నాకా కాలపాశ మందియ్యుము. ఓ పరమాత్మా! ఆర్త త్రాణ పరాయణుండం టారు- ఎందులకు? నీ హృదయకోశమున కరుణకు స్థానములేదే! నా సమాచారము నీతో చెప్పుట కెవ్వరిని వేడుకుందును- నీక త్యంత సన్నిహితు లెవరు? నా కన్నీటి యర్ఘ్యము నిన్ను చేరుట లేదా?

అని దుఃఖించుచు నొక్కసారి చంద్రుని చూచును. ఒక్కసారి తన శరీరమును చూచును. ఒక్కసారి నిశ్శబ్దముగా యుండుట గాంచును. ఒక్కసారి వృక్షములనుండి రాలుటాకుల శబ్దము వినును. ఒక్కసారి గట్టిగ నేడువ ప్రయత్నించును. ఒక్క సారి యందుండి తొలగ ప్రయత్నించును- ఒక్కసారి యందే

చతికిలబడును. తుదకు మోకాళులమధ్యన తలయుంచుకొని కన్నీటిచుక్కల నెంచుకొనుచుండెను. ఒక్కడు మెల్లగ యామె వెనుక వచ్చి నిలుచును. కన్నీటిబిందువు లెంచుట ముగియకుండుటచే నందే ధ్యానముంచి యుండును. హఠాత్తుగ సమీపమునయున్న ఛాయను చూచును. ఒక్కసారి కంటిలోనీరింకిపోవును. మేనెల్ల కంపము గలిగెను. దిగ్భ్రమతో నిలుచును. వ్యక్తిని చూచును- కంపము తగ్గును- హృదయము కొట్టుకొనుట యతిశయించును. భయస్వరమున—

మీరా!

అవును-

ఇంత యర్థరాత్రి- నిదురపోలేదా?

లేదు- ఏలకో! వంటరిగ యున్నావు?

వంటరిదానిని (కన్నీరుకార) ఏకాంతముననే హాయి యని తలతును.

బాధ ఏమి- విలపించుటకు కారణము?

అవసరము గలిగినందులకే నేను విలపించుచున్నానా- లేదు— లేదు.

పిచ్చియా! నా కన్నుల మోసము గల్గించుచున్నావా! (పట్టరాని దుఃఖమున) నేను తెలపవలయునా! నేను స్త్రీని— ఇది వెన్నెల—

అదియా కారణము-

అవును (గద్గదస్వరమున) ఏమీ తోచనప్పుడు స్త్రీలు దుఃఖించక నేమిచేయుదురు- వినువారుండినగదా దీనుల మనో వాంఛితములు పూర్తియగునవి- వాంఛలు పరిపూర్తి కాజాల వని తెలిసిన మేమిచేయగలము? దుఃఖమువలన కొంతైన శాంతి గల్గును.

ఈ యర్ధరాత్రి విలపించి దేహారోగ్యము పాడుచేసుకొనిన లాభమెద్ది? నీ విలాపముల వినువారెవ్వరు? ఈ చంద్రుడా, ఈ వృక్షములా, ఆ మెడలా- ఏమి నీ పిచ్చిభ్రమ——

మీకీ ప్రపంచమువలన ప్రయోజనము- మాకు- మాకు- ఈ చంద్రుడు, ఈ వృక్షములు, ఈ మేడలవసరము- మా విలాపములు వినునవి యివియే- మా సహచరు లివియే.

విచారమున మానవులు సర్వమును గోలుపోదురు. నిద్రాహారములు వీడిన నీకోరిక పూర్తియగునా?

నిద్రనా! శరీరము బాగుజేసుకొని జీవించవలయునా! ఈతను వెందుకుపయోగకారి- జీవించి చేయునదేమున్నది? ఎన్నట్టికైనను కన్నీరుస్రవంతి నిలుచునా- నాలోని విచారాంబుధములు తొలగిపోవు. బడబానలమును మించిన నాలోని తాపము శమించునా- అగ్ని కాల్చుటలేదా! ఈ శరీర మెంతదాకా కాలకుండా యుండును.

కష్టములు గలిగినవి గదాయని ఆత్మహత్య గావించుకొందువా? ఆత్మహత్య మహాపాపము. క్రూరులాచరించవలసిన క్రూరకర్మలు- దీనివలన వీడిపోయినది లభించునా- ఒకరిని

చంపిన పాపనరకము దీనివలన గలుగును. దీనివలన లాభమేది? భర్త పోయినాడు- నీ సుఖము పోయినదా? వానిరీతి నీవు ప్రపంచాని కగపడుటలేదా- ప్రపంచంలోని యానందములు నిన్నాహ్వానించలేదా- అన్నిటినిపొందు యోగ్యత గలిగియు "అనుమరణమా" నీ యనుమరణమున పోయిన భర్తకు జాలిగలుగునా- ప్రియురాలు కష్టపడుచున్నదని తలచి నీచెంత జేరునా- పిచ్చి. ఆత్మనింద మహాపాపము. చనిపోయినవాడు వచ్చుట కల్ల- అనుమరణమే సులభమైన, యిన్నాళ్ళు విలపించుటేల? దానివలననే యానందము గలుగునను నమ్మకముండిన, యిన్నాళ్ళు వేచియుండు టెందులకు? ప్రాణ మన్నిటిని మించిన తీపి. ఆశాలత యుండుదాక ప్రాణము పోవుట దుర్లభము. ఒకవంక యానందము వాంఛించుచు నొకవంక యాత్మహత్యను ఆహ్వానించ తగునా- యోచించు- రెంటికి చెడిన రేవడగుట భావ్యమా! నీ సౌఖ్యమేదో యోచించు. మూర్ఖుల పద్ధతిలో ముష్కరత్వము సచ్చరిత్రతకు భంగము. ఎందరు నశించుటలేదు- వారలకై యందరు పోవుచున్నారా? మేలే గలిగిన మరణమువలన భయము దేనికి? మరణశయ్యపై పవళించిన ముదుసలి మిత్తి నాహ్వానించునా- బీదవాడైనను, ధనికుడైనను పరము నపేక్షించునా? నీ లావణ్య యంగముల చూచుకొనుము. బ్రహ్మ వీటిని సృష్టించినది దేనికి?

(గద్గదస్వరమున) ప్రాణము వదలలేను- జీవించగోరను- కాని జీవించుచున్నాను- ఎందులకో! ఎవ్వరు నన్ను చావకుండా ప్రయత్నము చేయుచున్నారో!

ఎవ్వరో? ఈనీ స్నేహితులు, ఆ సుధాకరుడు, ఈ వృత్తులు, ఈ మేడలు. ఎంతదుఃఖ మనుభవించినను, జీవితముపై రోత యెంతగలిగినను, వీటినిచూచి దుఃఖము తెలుపుచు మనః శాంతి గలిగించుకొను చున్నావా లేవా? అవి యెన్నడైనను మాటలలో నోదార్చినవా? ఇట్లగుటకు కారణము జీవిత తృష్ణ. దారుణ యాపదలలో నైనను సకలప్రాణులకు జీవితతృష్ణ వదలదు. దీనిని జయించినవారిని చూచితివా! జ్ఞానశూన్యమైన జంతువును బంధించి యాహారమియ్యక కష్టపెట్టిన జీవిత శేషము బ్రతికియే యుండదా- మానవుడు స్వతంత్రుడు- బంధనముల తెంచు శక్తి వానిలో గలదు.

నాగతి యింతేనా! నాకు మరణమురాదా- (దుఃఖమున క్రింద పడబోవ రెండుచేతులతో పట్టుకొని)

సుశీలా -సుశీలా! జేలతనము మానుము- నీ ప్రయత్నము వృధా!

సుశీలకు తానెందో బంధించునటుల తోచును- దిగ్భ్రమ జెందును. తన కన్నీటినెవరో స్పృశించునటుల గోచరించును. తన్ను పడకుండా పట్టుకొనినాడని తలచును- పరపురుషుడని తలంపున దూరముతొలగ ప్రయత్నించును కాని మనస్సు కృష్ణారావు వడిని విడిపించలేదు. ఒక్కసారి దీనముగ చూచును నాల్గుకండ్లొక్కసారి కలియును- కండ్లమధ్యన చూపులొక్కసారి పెనుగులాడును- సిగ్గువలన తలవంచుకొని పట్టరాని సంతోషమున——

మీరా!

(నను చెక్కులుపై చేయుంచి) అవును.

పడకుండా పట్టుకున్నారా?

ఎంతదాక పడుచుండెదవు? దేవుడు దయామయుడు. క్రిందపడువారలకు నిలువ యాధారము నెద్దానినైన గల్గించును. దైవలీలలు విచిత్రములు.

(పైకిచూచి) నిజము! నేటికి నామొర విన్నాడు. నన్ను కాపాడ దలచితివా?

(చిరునగవున) నన్నడుగుచుంటివా! ఎంత యమాయకత్వము- ఈ చంద్రుడిప్పు డేమంటాడు?

మన యిరువురిని చూచి వేరుపరచనొల్లక మేఘముచాటుకు మరుగుచున్నాడు.

(ముంగురులు సరిదిద్దుచు) హా—హా! ఏమి నీ పోలిక- ఏకవి భార్యవో యైయుండిన వానికి శారద ప్రత్యక్షమేగా!

(చిరునగవున) మీరు కవులేగా!

ఒక్కసారి గాలివీచును- వాకిలి చప్పుడగును- ఎవ్వరో వచ్చిరను తలంపున పరస్పరము వీడి సెజ్జల జేరిరి. గడియారమందు నాల్గుగంటల శబ్దమగును. రెండుప్రాణులు నిద్రకై ప్రయత్నించుచుండిరి.

## 2

కృష్ణారావు ఆఫీసునందు కూర్చొనియుండ నాయుడు వచ్చును.

నాయుడుగారూ విశేషాలేమిటి?

మనపత్రిక డిమాండ్ (Demand) ఎక్కువైనది. ప్రతి యేజెంటూ ప్రతులుపంపుటలో పెంచమని యుత్తరము వ్రాయుచున్నాడు. ఏమిచెయ్యాలో తోచుటలేదు.

సాధ్యమైనంతవరకు పెంచ ప్రయత్నించండి.

అది నిజమే. ప్రభుత్వమునుండి కాగితపుకోటా పెంచుటకు వీలులేదని వచ్చినది. ప్రేమలేఖల జడివాన కురియుచున్నది.

అన్నిటితో మనకవసరమేమి? ఉత్తమమైనవే తీసుకునేది-

ప్రతీదీ యుత్తమ తరగతిదే.

కాని ఏదోరీతిగ నడుపవలసియే వచ్చునుగదా! జరగనీ- శరీరము బాగాలేదు ఇంటికిపోతాను.

కృష్ణరావింటికి చేరడముతోడనే బడలిక సడలినటుల తోచును. చెప్పరానంత సంతోషమున వాలుకుర్చీపై వ్రాలును- మెల్ల మెల్లగ యింటివాసాలు లెక్కించ ప్రారంభించును- ఇంతలో సుశీల చిరునగవున వచ్చి-

త్వరగా వచ్చినారే!

అవసరమైన పనులేమీ లేవు. నాయుడుగారికి ఉన్న కొద్ది పనులను చూడమన్నాను.

చెప్పి వచ్చేబదులు అందేయుండిన కాలము గడవదా?

ఇక్కడమాత్రము గడవదా!

ఇక్కడ మీ రొక్కరేగా!

నీవుకలిస్తే యిరువుర మగుదుము-

అబ్బా! ఎప్పటికీవేళాకోళమే- నాకేమీ ఇంట్లోపనిలేదా?

అనుకుంటే దండిగా ఉంటాయి.

హాయిగా యింటికొచ్చి తినేవారికి మీకేమి తెలియును. వక్కసారి వంగదీస్తేగా మీ బండారము బయలుపడునది.

అమ్మనాన్నా! అంత పెద్దపనా నాపైని- నీదయ. ఆ వంతు చెల్లించుకోకు.

కాలమెప్పటికీ ఒకేలాగుంటుందా! తమాషా చూచే దానను నేనున్నానుగా!

ఇంతలో "అయ్యా, అయ్యా" పిలుపు వినబడను. సుశీలా ఎవ్వరో కనుగొనిరా!

(చిరునగవున) చెప్పినమాట వినవలసినదేగా- అంటూ వెళ్ళిపోవును. కొంతసేపటిలో రిక్షావానితో సుశీలవచ్చును.

ఎందుకొచ్చావు?

మీ రూపాయలు మీ కియ్యవలయునని—

ఎక్కడివి!

ఆ నాడిచ్చినవి-

(సుశీల) అందుకేనా నీవు ప్రతిరోజూ రావడము-

అవునమ్మా-

(కృష్ణ) తిరిగి యియ్యమనలేదే-

కష్టపడకుండా తీసుకోలేనని యప్పుడే చెప్పియుంటినిగా- మీ రేమనుకున్నారో యని బాధ గలిగినది.

నీ పేరు?

రాముడు—

రాముడూ! 2 రూపాయలు బాగా జ్ఞాపకముంచు కున్నావే?

అవును స్వామీ- మా నాన్నా వాండ్లు చెప్పినవిద్య- ఎవ్వరి ఋణమున పోకూడదని—

నీవు చదువుకున్నావా?

చదువుకుంటే నాకీ గతెందుకు?

ఎంత పొరపాటు చేసినాను!

మేము పేదవాండ్లము- మాఊళ్ళో చదువుచెప్పువారెవరు? పెద్దయూళ్ళకొచ్చి చదువుకొనే యోగ్యత మాకు గలదా- బీద వాళ్ళకు తన శరీరబలమే ధనము. మాకు కావలసిన ధనము ధనికులకడ యుంటుంది- దానికి దారులున్నాయి.

సుశీలా! చూడు వీని యాదర్శాలు-

ఎందులకో కాని రామునిపై నాకుకూడా నమ్మకము గలుగుచున్నది. నమ్మకద్రోహి సమయానుకూలముగ మారువాడు కాదని నా యూహ.

నాకుకూడా యదే—రాముడూ! మాకడ నౌకరుంటావా?

చదువురాదుగదా బాబూ!

(సుశీల) నీకు తగినపనినే చూపింతురు.

అమ్మా! మీ చిత్తము-అన్నము పెట్టువారుండిన తినువారుండరా-

కష్టపడితే అన్నముదొరకదా?

మేమే కష్టజీవులమమ్మా! మేము వాంఛించునదే కష్టము.
అయితే రాముని నౌకరిపై యెప్పుడు చేర్పిస్తామంటారు.
నీయిష్టమెప్పుడో యప్పుడే.
అయితే నేడే.

అమ్మా! ఈకోజలాయగును. ఎవ్వరికైనను వారికివ్వవలయునుగదా!

సరే. రేపుదయమురా!

రాముడు నమస్కారము చేయును. వానిదృష్టిలో నమ్రత భక్తి పొర్లుచుండును. జీవితమును సౌఖ్యమును కలుపుచున్నారు గదా యను సంతోషము చేతులు జోడించుటలో విశదమగుచుండెను. వాడు పొమ్మన్న నున్మాదునిరీతి చూచును.

రాముడూ! నీకష్టములు తొలగినవిపొమ్ము
తల్లులదయ. తల్లి తలచితే బిడ్డలకు కరువా!

రాముడు బయటికొచ్చి రిక్షానుజూచును. అదియొక రాక్షసిగ గనబడును. దానిని పట్టుకొనుటకు భయపడును. తుదకేదో తలంపున బండిని లాగుతూ వెడలిపోవును.

౨

ఒకనాడు కృష్ణారావు గదిలోకూర్చొని ప్రేమలేఖ చూచుచుండును. మోహన్ పరుగెత్తుతూ వచ్చి:-
బావా! అక్కరమ్మంటుంది.
దేనికి?
కాఫీ

ఇక్కడకు తేకూడదూ?

అక్కడకొస్తేయేమౌతాయె. ఎప్పటికీ నీయధికారమేనా?

నీయధికారము చూపాలనుకున్నావా!

హుం! నేనింటికి పెద్ద.

పెద్దవాడు చిన్నవారలను మర్యాద చేయవలదా! నీకు మర్యాదనే తెలియదు.

హుం! నన్నే తెమ్మంటావా! నాకేమి- నేను తేను.

అక్కయ్యకు తెలుపు.

మాయక్కకేమి గ్రహచారమా!

మరి నీవనేదేమి?

నీవు నావెంట రావలసిందే.

రేపటినుంచి నీమాట వింటానులే. నీవు పెద్దగదూ! ఈరోజు మాత్రము నామాటవిను.

రేపటినుంచి తప్పక వింటావా? ఏమిచెప్పినా రేపటి నుంచి విను. తెలిసిందా?

హుం! ప్రేమళ్ళా.

తలవాకిట గుఱ్ఱపుబండి యాగును. మోహన్ అరుదు జేరును.

అబ్బాయీ! కృష్ణారావుండే యిల్లిదేనా?

హుం.

ఇంట్లో యున్నాడా?

ఉన్నాడు.

ఏమిచేయుచున్నాడు?

ఏమిచేయుచున్నాడా......కాఫీతాగ్రదలచినాడు.

(నవ్వుచు) నీపేరేమి?

నీపేరేమి?

గిరీశం. నేనువచ్చినానని కృష్ణారావుతో చెప్పుతావా?

ఇప్పుడే (లోనికేగును)

ఓ- గిరీశం- ఎప్పుడొచ్చావు? చాలాకాలమైంది చూడక.

పాడుద్యోగము వదలితేగా?

(ముగ్గురొక గదిలోకి పోదురు.)

మోహన్! నేచెప్పినది మ ర చి తి వా? ఇప్పు డిద్దర మున్నాము. (మోహన్ పోవును)

కృష్ణారావూ! అదృష్టము తిరిగినటులున్నది. అబ్బాయి యెవరు?

ఎడిటర్ కుమారుడు.

మాటల ముద్దు.

పిల్లలుగల సుఖసంసారమునకేనా మీ యానందం బ్రహ్మ చర్యాశ్రమమున నేముంటుంది.

పిల్లవాడు చిన్నయైనా తెలివి తేటలు పెద్దవి.

ఎట్లు?

నేను పిలిచేసరికి నా తలతిరుగునన్ని ప్రశ్నలడిగాడు. నీచేతి తరబియతేమో!

ఇప్పటికాలము పిలలు.

అబ్బాయితో కాలము సుఖముగ నడుచుచున్నదా? అదృష్ట మొకరుకోరితే వస్తుందా?

నీకుమాత్రి మే మైనది.

నాకేమైనదీ యా పరాత్పరునికే తెలియాలి. ఒకరికి చెప్పకుంటే నాకే యవమానము.

ఒక భాగవతమున్నదన్నమాట.

ఉద్యోగమెట్లు నడుస్తున్నది?

అంతానాదే!

జీతము.

మొత్తమున కధికారిని నేనే!

అయితే "అదృష్టవల" పన్నినావన్నమాట- ఇక్కడి కొచ్చేటప్పడే యనుకున్నాను, నీపంట పండిందని.

నాతో నొక్కమాటైనా యనలేదే.

నేనేమి జ్యోతిష్కునినా-

సరే- గిరీశం! మీయింట్లో అందరూబాగున్నారా.

గిరీశం చిరునగవొక్కసారి మాయమగును. అసత్యము చెప్పటో,సత్యముచెప్పటో నిర్ధారణ గాపించుకొనలేకపోయెను. అవమాన మానముల నొక్కసారి తలచును. తనసంగతి తెలియదని సంతోషమున-

అంతా బాగున్నారు.

పిరాకకు కారణము.

స్నేహితుని చూచుటకై.

గొప్పమేటు కొట్టినావు. స్నేహితునిపై నీకెంత ప్రేమ- గిరీశం! స్నేహితమంటే యిదే.

కవి శేఖరుడవు. నీలో పొగడ్తలు కరువా- కవయిత్రి జత కూడినదా!

సరస్వతి యెప్పటికి కూడియేయుండును.

అవును. ఆమె నిన్నాశ్రయించినసే బ్రికాశించునది. అట్లు కానియామె జీవితము నిష్ప్రయోజనమేగదా!

కృష్ణారావు చిరునగవు స్నేహితునిగాంచును. గిరీశం కూడా చూడదలచునుగాని దృష్టి క్రిందికే వాలును. కృష్ణారావు స్నేహదృక్కులు గిరీశం హృదయమును కలతగావించుచుండెను. మోహన్ రెండు కప్పులలో కాఫీ తెచ్చెను. కాఫీ త్రాగిన తరువాత గిరీశం:

నేను తిరిగివస్తాను.

భోజనానికిక్కడికేరా.

నన్ను క్షమించాలి. నేను రాజాలను. నేనొచ్చినపని యెప్పటికి ముగియునో ఎట్లు చెప్పగలను. నీకు వృధా శ్రమ గలిగించదలచను.

స్నేహితుడు పిలిచినప్పుడు రానంటే నెంత భావ్యమో యోచించు.

అన్యధా తలంచకు.

సరే. పొయ్యేటప్పుడైనా యొక్కసారి కలసిపో.

(గిరీశం వెళ్ళిపోవును)

(సుశీలవచ్చి) ఎవ్వరండీవీరు-

నా స్నేహితుడు గిరీశంబాబు.

ఈయనకు పెండ్లయినదా!

కాలేదు. నీకేమవసరము.

ఏమీలేదు. (చిరునగవున)

"వదినా-వదినా" అని పిలుపునిని సుశీల ప్రక్కగదికిపోయి కొంతసేపులో వచ్చెను.

ఎవ్వరామె.

మీ స్నేహితుని భార్య.

గిరీశం భార్యనా.

హా. మీయాఫీసునందుండే నాయుడుకూతురు.

గిరీశం పెండ్లికాలేదన్నాడే.

అయితే భార్యగాని స్త్రీ భార్యనంటుందా. మొగుడు కానివారిని మొగుడంటారా.

అత్తగారింటికి పోవడములేదా-

లేదు. ఇంగ్లాండు పోయివచ్చిన భార్యకావలయునట. ఛాయ మేనమామబిడ్డ. ఈమె మీ స్నేహితునికి నచ్చలేదట.

ఇంతకుపూర్వము చెప్పియుండిన యడిగేవాడినే. వాని నీచకృత్యము ఖండించేవాడనే.

నాకుమాత్రమేమి తెలియును. మీస్నేహితుడే ఛాయ భర్తయని. మంచి స్నేహితుడే లభించినాడు. మీకందరికీ నీతినే బోధించునా.

అబ్బా. నిన్నేమి పీడనులే-నీకేమి భయము.

చాలులెండి.ఎత్తిపొడుపులు. మీ స్నేహితుడా యని కనుగొనిపోయింది ఛాయ యిప్పుడే.

ఆమెసంతోషమే తెచ్చెయుండే.

ఏమని చెప్పింది.

ఏమిచెప్పుతుంది.

ఊరకనే పోయిందా.

నావారు మీవారికి స్నేహితుడా యనిమాత్రము యడిగినది. మీపై యేదో నమ్మకమున్నటుల యామెమాటలు బోధపడినది.

గిరీశం ఎంతనీచుడు.

మీ స్నేహితుడే గా.

మరి ఇంగ్లాండు పోయివచ్చిన కన్యయెవరు.

సరిగా తెలియదుకాని ఎవ్వరో డాక్టరు కూతురట. ఇద్దరొకేచోట చదివినారట.

గిరీశం తెలివితేట లెందాకాసాగినవి.

బి. ఏ. దాక చదివినాడు. ఏ మి లో టు- ఏదనుకుంటే సాగదు.......ఎందులకో పరధ్యానము.

ఏమీలేదు......నాపై నమ్మకములేదా.

లేకేమి. మీపైనలేకుంటే మరెవ్వరిపై యుంటుంది. కాని యీకాలము పురుషులు గంటగంటకు మారుతుంటారు.

అంతేనా- స్త్రీలు క్ష ణ క్ష ణ ము న కే- మీలో నంత తొందరపెట్టుకొని మగవారిపైననే దాడి.

పోనీలెండి. వాటితో మనకేమవసరము. (అని చిరునగవున చూచును. కృష్ణారావు బదులుచూడలేకుండా యుండలేక పోయెను. బజారులో జనసమూహముపోవు శబ్దము వినబడును. ప్రేమజంట వారల చూచును.

౯

గిరీశం విమలయిల్లు జేరబోవుచుండెను. అతని మనము బండిచక్రములకన్న వడిగా భ్రమించుచుండెను. ఆతురతకే తన పటాంచల చంచలమైయుండెను. సంతోషము గుఱ్ఱపు వేగమును వెనువిడిచి ముందు పరుగిడుచుండెను. ఎన్ని త్వరపడినను శరీరముమాత్ర మందేయుండెను. అట్లుయుండుట గ్రహించి ఖేదపడునుకాని తన యవివేకమునకు సిగ్గు జెందును. తన మనస్సును గుఱ్ఱము లనుసరించడములేదని బండివాని త్వరపెట్టును. వానివలన వ్యతిరేక బదులుబడసిన తనకుతానే సిగ్గుజెందును. ఇంతలో గిరీశమునకు స్వర్గధామమగుబడెను. పెదవులలో చిరునగవు, కన్నులలో నొక యాశ, చెవులలో మృదుశబ్దము సంభవించును. విమల గేహము చేరుచునే గిరీశంకు బండి దావానలమయ్యెను. బండదిగి యొక సేవకునితో-

విమలాదేవిగారున్నారా.

హాఁ బాబు.

ఉత్తర మందజేయి.

వాడుత్తరము తీసుకొనిపోవును. అందేనిలచి దేనినో యాలోచించు చుండెను. బండివాడు—

బాబూ బాడుగ యిస్తారా.

గిరీశం దిగ్భ్రమజెంది వానికి బాడుగయిచ్చి పంపించెను. అంత విమల మేడపైనుండి వచ్చుట గానవచ్చును.

ఆమె యప్సరసగ గానబడుచుండెను. తన్నుద్ధరించ వచ్చు దేవతయే యని యొకసారి తలచును. తన భావి భాగ్యోదయమని యొక్కసారి యూహించుచును. తన జీవాధారమని యొక్కసారి ధ్యానించును. తన జీవన ముక్తిదాయకమని యొక్కసారి జపించును- ఆమె సమీపించుకొలది గిరీశం చూపులు సన్నగిలుచుండెను.

హలో! గిరీశం- **How are you**

**O. K.**

చాలారోజులకు దర్శనభాగ్యము గలిగినది. రావడానికిష్టము పుట్టలేదా?

అబ్బే! అలా యెన్నటికైనా జరుగునా- ఉద్యోగము లభించినదాకానే మనయిష్టము. ఆవల వారిఇష్టము.

రా (నౌకరునుచూచి) ఈమూటలింట్లోపెట్టు.

గిరీశమునకు విమలహస్తము ముట్టుకొనడముతోడనే విద్యుచ్ఛక్తి ప్రసారము సాగును. విడువదలచినుగాని చంపునదిగా పని దృఢపరచుకొనును. గది ప్రవేశించుచు-

విమలా! నిన్నుచూడక చాలారోజులైనది.

నేనడిగినమాటేగా!

విమలా! నీవు కలలోగూడా యగపడుదువు. నీ స్మరణ తప్ప నాకు వేరేలేదు.

(విలాసమున చూపుచూచి) ఓహో! **Mr.** గిరీశం నీ ఫైలులో యిదే వ్రాస్తుంటావా? అందులో నాపేరెక్కించదన్న మాట. నేను దొంగతనము చేయలేదు బాబూ-

నీవు దొంగవు. నామనస్సును హరించినావు. నీరీతి ఘన దొంగను వ్రాయకుండా వుండగలనా?

హా—హా—How nice (నగుచు) చెలి మెను త్రిప్పిన నీటికి కరువా! ఏమి తక్కువవాడవని లొంగిపోదువు?

(నగుచు) నీ ఒక్కదానికి మాత్రము లొంగిపోతాను.

(ధీమాగా) నాకుమాత్ర మెందుకు లొంగిపోతావు?

(చిరునగవున) ఎందుకో విమలా! అదే నేను తలుచుదు-నిన్ను కలసినప్పుడీ సమస్య యడ గదలచినాను. కాలేజీలో నేను నీకు గురువును- కాని యిప్పుడు నీవు గురువువు-

అమ్మనాయన- ఎంత పెద్దశిష్యుడవు. గిరీశం నాతో గాదు నీవడిగే సమస్య క్లిష్టమైనది.

విమలా! సులభమైన నామనస్సుకు తట్టదా? దీని నింత దాకా తీసుకొనివచ్చే వాడనా? ఎంత బుర్ర పగలగొట్టుకున్నను తోచడములేదు.

గిరీశం- ఎంత కష్టపడినావు! ఎందుకో నీకు తెలుసా? మొట్టమొదట నీమనస్సుది తప్పు- తరువాత ఆ నీ కన్నులది- ఆనీ చెవులది- ఈ మూడే నిన్ను లొంగదీయుచున్నవి.

కాదు విమలా! వీటి విషయము నాకు తోచినది- ఒకటి కావచ్చు ననుకున్నాను. అవి యెంతవరకు నిజమో...

ఏవవి- నేనువింటాను.

(ధీమాగా) ఆ నీ యాననములోని చంద్రకాంతి, ఆ నీ బాలచంద్రుని పెదవుల సుధారసము, ఆనీ కీర్గంటిలోని సమ్మోహనాశక్తి, ఆ నీ మృదుపలుకులలో వీణెయమీటు సుస్వనములు,

ఆ నీ తనులావణ్య వెల్లువ, అన్నిటినిమించిన నీ మృదు బాహు లతా పరిరంభణములు——

హా——హా! (నవ్వుచు లాగుచు సోపాపై బడును) గిరీశం ఉద్యోగము చేయుచు కవిత్వము నేర్చుకున్నావే?

సరస్వతీ ప్రసన్నమునకై సరస్వతీస్తోత్రము పఠించ వలదా? ఆ దేవతకు దయగలిగినగాదా వరములు బడయుట-

(విలాసమున చూచుచు) గిరీశం-

విమలా! ఏమి యనుమానము?

నీవేమీ అనుకోవుగదా?

నే నేమనుకుంటాను-

నీకు పెండ్లయినదా?

(గంభీరమున) ఎందుకు?

గిరీశం- మనమీ ప్రణయలీల లెందాక రహస్యముగ యుంచవలయును- ప్రపంచమునకు వెరచి మెన్నాళ్ళు జీవించ గలము- ఇరువురిపెండ్లి జరిగిన (చెప్పనోల్లక యాగును.)

గిరీశం హృదయమున యాకాశము బడినటులగును- ఎవ్వరో తనవీపున ఖడ్గముతో పొడిచినట్లగును- ఆ గదియంతయు నొక్కసారి గిఱ్ఱున తిరుగును- విమల యగుపడును- ఆ స్థలముననే ఛాయ యగుపడును. విమల చంద్రాననము చూచును- అప్పుడే ముకుళిత ఛాయ యాననము గోచరించును. విమల మృదుపలుకులు దూరినటులగును- అప్పుడే ఛాయా విలాపములు దూర ప్రయత్నించునటుల గోచరించును- ఒక దేవత, ఒక పిశాచము గనబడును. ఆనంద మేగదా వాంఛనీయమని తలచి-

విమలా! నేను బీద యుద్యోగిని- నీవు ధనికురాలవు- మీ నాన్న సమ్మతించునా?

గిరీశం- మన ప్రేమల కితరుల యడ్డేమిటి- ధనము, దరిద్ర్యభేదము ప్రేమ కుంటుందా? ప్రవాహము మడుగులలో ఎండి శుష్కించిన సైకతస్థళములలో ప్రవహించదా- ఎంత భయంకర స్థలమైనను ప్రవహించ వీలుగలిగి పారదా- నా ప్రేమ ప్రవాహము పారుటకు నీ హృదయసీమయే సమప్రదేశము-

(వడిలోకి లాగుకొని) విమలా!

(విలాసముగ చూచుచు) సమ్మతించితిరా?

(చిరునగవున) విమలా! నీ పవిత్ర యాశయములు వృధా యగునా- ఈ శరీరములే వేరు- మనస్సులొక్కటే- చిరకాల వాంఛితము నీ నోటినుండి విని ధన్యుడనైతిని. తండ్రి యనుమతికై ప్రయత్నించు.

(దిగ్గున లేచి) అందులో నీకు సందేహ మెందులకు? అదీ గాక నేను చిన్నపిల్లనా- ఇంగ్లాండుపోయి వచ్చినదానను. నా ప్రియుని నేను సెలెక్టు (Celect) చేసుకునే హక్కుంది.

చిరునగవున గిరీశం విమల భుజముపై చేయి వేయబోవును. ఇంతలో నౌకరు కాఫీ తెచ్చును.

## ౧౦

ఒకనాడు కృష్ణారావు ఉత్తరము చదువుచుండును. సుశీల కాఫీ తెచ్చును.

ప్రేమలేఖ వచ్చినటులున్నది-

నా కెవరు వ్రాస్తారు!

సంపాదకులు గారా?

అదియా నీ ఉద్దేశ్యము- ఇదిగూడా యొకమాదిరి ప్రేమ లేఖయే.

అంటే?

స్నేహితుడు వ్రాసిన లేఖ.

ఎవ్వరు?

గిరీశంబాబు-

ఏమని వ్రాసినాడు?

ఏమని వ్రాస్తాడు- అంతా క్షేమమని-

ఇంకేమైన——

ఆధోరణి మరుచునట్లు లేదే-

మీ స్నేహితున కుత్తరము వ్రాయగూడదా?

వ్రాయ సిద్ధమగుచుండ నీ వాటంక పరచితివి.

(కోపము నటించుచు) నా కేమవసరము నేను పోతాను లెండి-

సుశీలా! నీ కోపముగూడా తక్షణమైనదే! ఏమని వ్రాయ వలయునో నీవే చెప్పు-

నేను మాట్లాడవలదుగదా-

అబ్బా- అన్నీ నీనే యనుకో- నే నడిగినదానిని నీవు చెప్ప కుండిన యెంత బాగుండునో యోచించుకో- నీవుండబట్టి నేని క్కడ వుత్తరము వ్రాయ సంకల్పించినది.

చెప్పమంటారా- ఛాయను తీసుకపొమ్మని వ్రాయండి. ఛాయ నీకై ఎక్కువ తపించుచున్నదని వ్రాయండి.

ఈ రెండుమాటలేనా?

మిగిలినది మీరే వ్రాయండి. మీ స్నేహితునికి నచ్చేరీతి మీకే తెలియాలి.

ఈ రెండు మాటలకొరకు తులాభార నాటకము చూపితివే- నీవు లభించుట నా జీవితనావ సుఖముగ ప్రవహించుచున్నది. సుశీలా! తుపాను గతించినతరువాత ప్రశాంతత యేర్పడును. ఒక తుపాను నిన్ను బాధించినది. ఆతూరి మాయమైనది.

ఎవ్వరు చెప్పగలరు- పెనుగాలులు సముద్రమున తరచుగ వచ్చుచుండును. అది దైవశక్తి.

సుశీలా! మనయీ భవాంబుధిలో తుపానుగల్గుట కల్ల- కలుగనే కలుగదు.

అక్కా——ఆక్కా——(మోహను పరుగెత్తి వచ్చును.)

ఏమిరా మోహన్-

రామునికి దెబ్బతగిలినదే!

మన రాముడా?

అవునక్కా——

ఎక్కడున్నాడు?

బయట-

త్వరగాలేచి బయటకొత్తురు. రాముడు రక్తమువలన తడసియుండును. శిరస్సునుండి గంగానదిరీతి రక్తము ప్రవహించుచుండెను. అతని దీనచూపులను పరులకగపడకుండ యద్దు

తగులుచుండెను. పెదవులందు కంపము- చూచువారలకు భయంకర కాళికరీతి యగుపడుచుండెను. రాముడు ప్రపంచమును చూచుచుండెను గాని వానికి జగతి వెఱ్ఱిగ యుండెను. కొందరు రక్త స్రవంతుల నాపుటకై ప్రయత్నించి విఫలు లగుచుండిరి. ఏలన భారతభూమి బిడ్డ రక్తము నాశించుచుండెను. రాముని రక్తమున మాత సంతసించియుండును. పుత్రునిపై యుండు అనురాగము ప్రపంచమునకు చూపుచుండెను. తల్లి హృదయము తృప్తి జెందెనుగదా యని రాము డానంద బాష్పముల నిడుచుండెను. ఆ బాష్పములు రక్తముతోగూడి తల్లి పాదములపైబడి పవిత్రమగుచుండెను. రాముని పుట్టుములు చినిగి రక్తముతోగూడి జననిపాదముల జేరదలచినవేమో యనునటుల యధాముఖమై యుండెను. సుశీల భయంకరదృశ్యమును చూడలేకపోయెను. విచారమున-

రాముడూ——రాముడూ! అని పిలుచును- రాముని పెదవులపై చిరునగవు కనబడును- వాని నోటినుండి "జైహింద్" అను శబ్దము వినబడును. ఆశబ్దము కొన్ని మైళ్ళ దూరమునుండి వచ్చినటుల వినబడును- కృష్ణారావునకు "జైహిందు" అర్థము స్ఫురించెను. రాముని శరీరమున సుబాసుబాబు యగపడును- ఆజాదు సైన్యము వాని దేహముపై బరుగిడునటుల తోచును- ఎవ్వరికొరకు రాముడాత్మ బలిదానము చేయదలచెనో బోధపడెను. ఏ మహాశక్తి- ఏ ప్రణవమంత్రము- ఏ ఆశాలతా, ఏ దివ్యజ్యోతి రాముని బలిదానము గావించ దలచినదో మనమున మెదలదొడగెను. (కృష్ణారావు తనలో) "రాముడూ నీ త్యాగ

మహారము- నీవు బీదవాడవు- నీ యుద్దేశ్యములు బీదవిగావు. నీ శరీర మాహారములేక కృశించినది కాని నీ యాశయము నశించ లేదు. నీ వస్త్రములు, నీ రక్తము జీర్ణించినవి కాని మాతృప్రేమ దేశ సౌభాగ్య వాంఛితములు జీర్ణించలేదు. శరీరము సన్నగిలి నను హృదయతాపము శమించలేదు. వీరుడవు" అని తలచు చుండ- రాముడు తన హస్తమునయుండు సుబాసుబాబు చిత్త రువిచ్చును. అది రక్తమయమై యుండును- ఏ మహావీరుడు సర్వదా భారత స్వాతంత్ర్యదీక్షా తత్పరుడై పోరాడుచుండెనో యా మహావీరుని చిత్తరువు భారతీయుని రక్తమున లిప్తమై యుండెను. భర్త విచారము రాముని భయంకరస్వరూపము చూచుచు నేమియు తోచక-

చిత్తరువెవరిది? అని చిత్తరువుతీసుకొని చూచి దిగ్భ్రాంతి జెందును. అంతయు నామెకు బోధపడెను. రాముని యాయా సము పలుకులు సుశీలకు ములుకులై నాటెను. ఆమె నిలువలేక పోయెను- వెంటనే తన వస్త్రముచించి వాని గాయములకు కట్టెను. సుశీల హస్తస్పర్శచే రాముడు "అమ్మా-అమ్మా" అని దీనముగ చూచును.

రాముడూ- విచారించకు- (ప్రియునిచూచి) రాముని వైద్యాలయమునకు గొనిపొండు. ఎంత బాధపడుచున్నాడో!

అంత కృష్ణారావు రాముని గుర్రపుబండీలో వైద్యాల యమునకు గొనిపోవును. రాముని చూచుచునే డాక్టరు మండి పడి కృష్ణారావుతో-

ఏమిజ్జరిగినది?

ఈరోజు గలాటాలో దెబ్బలు తగిలినవి.

తినడానికి తిండిలేకున్నా వాటితో వీనికేమిపని? అందులో పోయేది- చావ దెబ్బలు తినేది- మమ్ముల బాధించేది- అక్కడ కూర్చొబెట్టు- ఇప్పుడవసరమైన పనులున్నాయి.

డాక్టరుగారు కోపపడితే ఏలా! బాధ యనుభవించువాడేగదా-

ఊరక యుండలేక యెవ్వరు పోతున్నారు?

వానికి యుద్యోగములేదు. ఇంట్లో కూర్చొని తినడానికి- వాడు కష్టజీవి. కష్టపడితేగాని కడుపునిండదు. వాడు రోజెంత కష్టపడునో మీకేమి తెలియును?

ఇది లెక్చరింగు హాలుగాదు- ఇది డాక్టరు ఆఫీసు.

అందులకే యిందు రోగుల తెచ్చునది బాధపడువారే మీకడ కొచ్చేది. మీరు వినకుంటే వినువారలెవ్వరు?

ఎక్కువ మాట్లాడకు- కూర్చో.

కుర్చీమీద కూర్చొని యున్నంతమాత్రమున గొప్పవారమనుకుంటారా? ఈ గర్వము నశించాలి.

అక్కడుండే కొందరి సంతకములు తీసుకొని పోవుచుండ డాక్టరు భయపడి కృష్ణారావును పిలిపించి-

ఎక్కడకు వెళ్ళేది?

మందియ్యనిచోట మాకేమిపని- ఈ హాస్పిటలు ఎవ్వరికొరకో తెలుసుకోడానికి పోవలదా?

అవసరమైన పనులున్నాయంటే తొందరపడి లాభము?

తొందరపనిఉంటే పూర్తి చేసుకొండి- మీ పనులకు మే మెందు కాటంకము-

డాక్టరు కోపమున మందుకాగితము వ్రాసి యియ్యి కృతజ్ఞత తెలిపి యింటికి వచ్చును. సుశీల-

రాముడేడి?

ఇంటికి పోయినాడు.

పాపమెంత గాయము తగిలినది- వాని రక్తముచూచి నాకళ్ళు తిరిగినవి- ఎంత క్రూరులో వానిని కొట్టినవారు-

బాని సత్యము- ఎవ్వరెందుకు కొట్టుదురు- రాముడు తెచ్చిన చిత్తరువెద్ది?

మీగదిలో యున్నది.

(గదిలోకిపోయి చిత్తరువుచూచి) దీనిరక్తము తుడిచిన దెవరు?

నేనే-

ఎంతపని చేసినావు- రాముడు తన చిత్తరువియ్యమన్న దేనినిచ్చెదవు?

ఆ చిత్తరువునే-

రక్తము చిత్తరువునకెక్క యలంకారలోప మనుకుంటివా! వాడు ప్రజల కేయాశయముల తెలుపదలచి యుండెనో యవి యన్నియు యిప్పుడుండవు-

కొన్ని చిత్తరువులకు హఠాత్తుగ దైవశక్తి రక్తముతగిలి కనబడకుండా చేయునుగదా యని కడిగితిని.

సుశీలా! మానవులపై మాత్రమే నీకు సహజప్రేమ. ఇప్పటి మన జీవితములు సౌఖ్యముగా జరుగుచున్నవని తలచు చుంటివి. మనమెన్ని బంధనముల బంధింపబడి యున్నామో తెలియదు. రాముడు మానవు నెందులకు మోసెడివాడు? చిత్తశుద్ధితో బండిని లాగుచుండెనా! ఎన్నటికి లేదు. ఇంటిలో యాకలి మరపులు, వెలుపల పిశాచముల భయంకర శబ్దములు వానిని లాగించుచుండెను. అన్నిటిని మించినది వాని సత్వము.

౧౧

కొంతకాలము గడచును. సుశీల జ్వరబాధితురాలగును.

అక్కా ఎట్లున్నది?

బాగున్నదినాన్నా-పో-ఆడుకో-పో-

ఏడుస్తున్నావా! బావకు చెప్పెద (త్వరగా కృష్ణారావున్న గదిలోకి పోయి)

అక్క ఏడుస్తున్నది-

ఎందుకురా?

అడిగితే మేమీ తెలుపదు-

(కృష్ణారావు సుశీలను సమీపించి మంచముపై యొకకొనకు కూర్చొని శరీరమును తాకి)

జ్వరమొచ్చినది- హాస్పత్రికి పోదామా?

ఒక్కడకుపోతే మనవెంట మెవ్వరుండేది- మీరు వంటరిగారు- మీరుండగలరా?

సుశీలా! నీకన్న నాకెవ్వరు- మీ నాన్నా మోహాను ఉన్నారుగా- అప్పుడప్పుడు ఛాయ వస్తూంటుంది.

మనకందు సౌకర్యములు తక్కువ. డాక్టరును ఇంటికి పిలుచుకవచ్చిన బాగు. ఛాయ కావలసినంత సహాయ మింట్లో చేస్తుంది.

సరే- ఇప్పుడే పిలుచుకవస్తా.

(లేచి నవ్వుతో) నేను కోరి మిమ్ము బాధించను. ఈపాడు జ్వరము——

ఎంత గొప్ప పొరపాటు పడినావు! (వెళ్ళిపోవును)

సుశీల దేహము జ్వరతాపమును మాడ్చివేయబడుచుండెను. గాని యామె యగపడుట వ్యతిరేకము- ఏలన తనబాధ నెఱిగిన ప్రియుడు ఖేదపడునేమోయని భయము. ఎంతబాధ గలిగినను ప్రియుని ముఖావలోకనమున మరచుచుండెను. ఆనంద భాషణములనే ప్రియుని యనుకరించుచుండెను. తనకై ప్రియుడు తపించుట సహించదు. అట్లుతోచిన దానిని మరపించు భాషణములు తీయుచుండెను. సదా ప్రియుని యానందమే యామె యాశయము- ప్రియుడు సంతోషముగ మెలగుటే యామెగోరుట- సర్వస్వము ప్రియుడే యని నమ్ము భారతీయ నారీమణులు కోరునదేమి? ఆమె సంతోషమే కృష్ణారావు ధైర్యము- కృష్ణారావు ఆ ధైర్యముననే హాస్పటలుకు పోవును. డాక్టరుతో

సార్- మా సుశీలకు జ్వరబాధ- మందుకావాలి.

ఇంతవరకెక్కడ "ట్రీట్‌మెంటు" జరిగినది?

ఎక్కడా లేదు-

పిలుచుక రాలేకపోయావా?

ఇంట్లో అనుకూలము లేదు- మీ రొక్కసారి ఇంటికివచ్చిన బాగు——

ఒక్కనిమిషము విరామములేదు. మందు తీసుకొనిపో-

"ఫీజు" యిచ్చుకుంటాము.

ఇప్పుడు టైములేదు- సాయంత్రము-

కృతజ్ఞత తెలిపి మందుతీసుకొని వచ్చుచుండును- అప్పుడు డాక్టరు పెంచినకుక్క మొఱుగుతూ వెంటబడును- కృష్ణారావు తప్పించుకొనుట కెంత ప్రయత్నము చేసినను సైకిలు కుక్కకు తగులుట తప్పదాయె- కుక్క మొఱుగుచు పోవును కొలదిదూర మున తోటలో విమల "Love is blind" అను నవలను చదువు చుండెను. అఱుపువిని దిగ్భ్రమతో రాగా కృష్ణారావు ఏమియు తోచక నిలబడును.

కుక్కకెందుకు దెబ్బ తగిలినది?

నేను పోతుంటే సైకిలున కడ్డముతగిలినది. కావలయునని సైకిలును కుక్కపై తోలలేదు.

సరిగా రాకుంటే నడిచిపోవాలి. ఎంతబాధ పడుచు న్నదో చూడు——

నాకు తెలియును- కాని యేమిచేయగలను? కొంత ఆగిన అదే యరపుమానును. దీనికింత విచారమా!

నా ముద్దుకుక్కకు దెబ్బతగిలించి తిరిగి తప్పుగాదని గర్వ పడుచున్నావా? సైకిలు తీసుకొనివచ్చుట కెవ్వరియాజ్ఞ?

నా కుత్తరు వవసరములేదు. ఇది ప్రజలువచ్చు స్థలము. ఈలాంటి కుక్కలను యెవ్వరు సాకమన్నారు? దీనివలన యెంద
ఱికి బాధ కలుగుచున్నదో!

(కోపమున) మాపైననే తిరుగుబాటు- (సేవకునితో) నాన్నను పిలుచుకురా!

(డాక్టరువచ్చి) ఏమి విమలా!

ఈ పెద్దమనిషి కుక్కపై సైకిలు నడిపినాడు. తనతప్పు గాదంటున్నాడు-

ఏమండీ?

మీ అమ్మాయి చాలా దయగలది- కుక్కలపై యింత మక్కువ చూపుచూ మానవులను తిరస్కరించుట యేదేశమున నేర్చుకున్నదో- మానవులకు, జంతువులకు ఉన్న భేదమే తెలియదు మీ అమ్మాయికి. చిన్ననాటినుండీ యీవిద్యనే నేర్పితిరా? విచారము- భారతదేశమునపుట్టి యీవిద్య నేర్చుకున్నారంటే మాకు సిగ్గుచేటు.

చూడునానాన్నా! తప్పుచేసి పైనుండి నీతులు-

నీతులుకావండీ- వాస్తవస్థితి- డాక్టరుగారూ! ఈ కుక్క బాధ మీకంత యవసరము గల్గించినదా? ఇంత తొందరపడ వలసిన యవసర మేమున్నది? సాయంత్రము సరిపోదా?

నాన్నా! ఎక్కువ మాట్లాడుచున్నాడు- తప్పుకు తగిన జరిమానా వెయ్యాలి.

(ఆశ్చర్యమున) దీనికి పైనా!

(కోపమున) హా—పదిరూపాయలు.

(జేబులుతడవి) ఇప్పుడులేవండీ- కుక్కదెబ్బ మాన్పడానికి పదిరూపాయిలు ఫీజా- మాట్లాడరేమి డాక్టరుగారూ!

చష్- (అని వెళ్ళిపోవును)

రూపాయిలిప్పుడు లేవండీ సాయంత్రమిస్తాను.

అది కానేకాదు.

మరేమిచేస్తారు- సైకిలు తీసుకోండి-

సరే- (నౌకరుతో) సైకిలు తీసుకపో- రసీదేమైనా కావాలా?

మీరు మాకు నమ్మకమే- మానవుని మానవుడు నమ్మకుంటే యేలా?

అని చిరునగవున చూచుచు కొంతదూరము పోవును. తిరిగి యొక్కసారి వెనుదిరిగిచూచును- విమల తనదిశనే చూచుచు నిలుచునటుల గ్రహించును. పోవుచు వెనుచూచును- కాని విమల యధాప్రకారము చూచుచునే నిలిచియుండును- కృష్ణారావు లోలోన నవ్వుకొనును- తాను జాగుచేసిన సుశీల యేమితలచునో యని త్వర త్వరగా నడచుచుండును- ఎంత నడచినను గేహము రాదు- తుద కిల్లుచేరి సుశీలతో—

ఇదిగో మందు-

(మెల్లగ) డాక్టరు రాలేదా?

ఏమియుతోచక వాడిన ముఖకమలమును, రాగముతప్పిన దొండపండువంటి పెదవులను, వాలుచూపులు దప్పిన కనుదమ్ములను చూచుచు నిలుచును.

డాక్టరు రానన్నాడా?

సాయంత్రము వస్తాడు.

సరే- మందియ్యండి-(మందుత్రాగి) ఎంత కాలకూటము!

ఈ జ్వరమున కీమందే-

మీ హస్తస్పర్శచేతనే యిది నా రోగనివారిణి- ఇదినాకు అమృతమయమే-

జ్వరబాధితు రాలవయ్యు వేళాకోళమే వాంఛించుచున్నావా?

మీరింత సేవ జేయుచుంటే కృతజ్ఞత తెలుపవలదా- కంటికి రెప్పరీతి గాపాడుచున్నారే-

౧౨

ఒక కారు అతివేగముగ బోవుచుండెను. అందులో ముగ్గురు వ్యక్తులు కూర్చొనియుండురు. అందులో నొకని మోముపై బీదత్వము, రెండవవాని మోమున యుద్యోగగర్వము, మూడవవాని మోమున విచారము నగుపడుచుండెను. ముగ్గురును మార్గమును చూచుచునేయుండిరి. వారలు పరస్పరము మాట్లాడ కుండా రాతి విగ్రహాలరీతి కూర్చొనియుండురు. అందులో ఒకని చేతులు, కన్నులు పనిచేయుచుండెను. రెండవవాని కన్నులు, మూడవవాని హృదయము వ్యాపారము సాగించుచుండెను. అందులో నొకని భావములు గాలిచే కదులుచు కాగిత రీతి చలించుచుండెను. వానికే కారుయింజను వేడి యొకరి శరీరతాపముగా స్మరణకు తెచ్చుచుండెను. ఆకారు ఒక భవనము జేరును. కారునుండి ఇద్దరుమాత్రము దిగి యా భవనములోకి

పోదును. కొంతసేపటిలో నొకరు కారుకడకువచ్చి డ్రైవరుతో "బండి పోనీ" యని చెప్పను. ఇంతలో నొక నౌకరొచ్చి కారు నాపును- వాడు కారులోయుండు నొకరితో-

సార్! మా దొరసాని మిమ్ములను రమ్మన్నది- మీకై యందే వేచియున్నది.

పిలువబడినవ్యక్తి దేనినో యాలోచించి కారుదిగి నౌకరును వెంబడించును- అప్పుడొకవ్యక్తి ——

ఏం సార్- మువస్తు వెన్నాళ్ళు కాపాడగలము, తీసుకపొండి.

ఈరోజుకుమాత్రము క్షమించాలి. రేపు తప్పక తీసుకపోతాను.

అందులో ఏనష్టమైనా బాధ్యులము గాదు- తరువాత విచారించిన లాభముండదు.

నేను కారులో వచ్చినాను- మరేమి విచారించకండి.

మీపేరు?

కృష్ణారావంటారు.

ప్రేమలేఖ సంపాదకులు మీరేనా?

హా——

మీసైకిలు తప్పక రేపు తీసుకపొండి-

తప్పక- రోజూ ఇంతదూరము నడచివచ్చుట కష్టము గాదా!

ఈ ఒక్కసారి మీకు పిలు కలుగిజేస్తాను.

కృతజ్ఞుడను. మీమేలు మరువను.

ఇంతలో కారు హారన్ శబ్దము వినబడును. కృష్ణరావు త్వరగా కారుకడకొచ్చి యందులో కూర్చొని విమలనొక్కసారి చూచును- ఆమె తన్నే చూచుచుండెను- కుక్క ముందు తిరుగు చుండెను. కృష్ణరావు పోవుచూ-

"కాలగతిని గనుగొనుట దుర్లభము. తానొకటి తలచిన దైవమొకటి తలచును- మానవుడు నిమిత్తమాత్రుడు- ఎంత ప్రజ్ఞావిధుడైనను విధి నుల్లంఘించునా" అని తలచును.

మరునాడు సుశీల మందుకై కృష్ణరావు వైద్యాలయము నకేగును. మందుగైకొని యింటికి మరలెను- విమల ప్రాంగణ మున పచారము చేయుచుండెను. ఆమెకన్నులెవ్వరినో చూచు చుండెను. ఆమె రూపలావణ్య విలాసిని- మెఱుపుతీగెలను తిర స్కరించు సామర్థ్యముగలది- యామె బింబోష్ఠ చిరునగవు, ఆమె కన్నులజూచిన హరిణములు శుశ్రూషకై తహతహ పడెడివి- కలువలు చంద్రోదయారంభమున వికసించి ప్రకాశించుమాడ్కి యామెముఖము- కృత్రిమకల్పిత నేపథ్య శృంగారము యామె శరీ రమును, ముఖమును దర్పణము చేసెను. కవిదృష్టిలో యామె సాహిత్యదర్పణము- సన్యాసి చూపులలో కాలపాశము, కవి దృష్టిలో సుధారస కనకచషకము- ఆమె స్మితవదనయైన కవి చపలములని తలచును. కామితను మోక్షముజెందింపు దేవీ ప్రస న్నతయని తలచును- విరాగి తనపై యమధర్మరాజు మృత్యువు నుపయోగించెనని తలచును- ఎందరెన్నివిధముల తలచినను, ఎందరెన్నిరీతుల చూచినను విమల సౌందర్యరాసి. కృష్ణరావు తన దారిని పోవుచున్నటుల గాంచును- ఏలనో యామెకన్నులలో

వేగము, మాటలలో తొడబడ, అంగములలో కంపము పొడ కట్టెను. నౌకరునంపి కృష్ణరావును పిలిపించును. కృష్ణరావుపై చూపిన గర్వమునకు సిగ్గిలి ఆయన సమీపించుకొలది యందు నిలువజాలక గదిలో సోఫాపై కూర్చొనును. కృష్ణరావు వినయమున పోయి,

పిలిపించారెందుకు?

ప్రతిరోజూ మీది పాతపాటయేనా! సైకిలుసంగతి మరచినారేమో-

మరవలేదు. చేత డబ్బు లేదు- ఉన్నది మందులకే చాలకున్నది- మీమూలాన కాళ్ళు వాస్తున్నాయి.

ఇప్పుడు తీసుకపోయే యుద్దేశ్యము లేదా?

హా! వీలుంటే నాకీయవస్థ యెందుకు? క్షమించండి- పోతాను-

ఆ కాళ్ళనొప్పులు కొద్దిగా తగ్గనిదే!

నేనిక్కడ జాగుచేసిన రోగి బాధపడును.

Mr- కృష్ణరావూ! కొన్ని ప్రశ్న లడుగుతాను- సక్రమముగ బదులు నియ్యగలిగిన సైకిలు నీకిస్తాను.

సాధ్యమైనంతవరకు ప్రయత్నము చేస్తా-

కూర్చో. భారత దేశమున స్త్రీల యాదర్శాలెవ్వి?

సన్నడుగుచున్నారా? మీరు భారతీయులు గారా? ప్రశ్న వింత-

నేను కానని గాదు- నేను చదివినవాటికి, ఇతర దేశాలలో ప్రచారములో నున్నవాటికీ చాలా భేదా యున్నది. ఇతర దేశా

లలో కొందరు నన్ను ప్రశ్నించినారు. అప్పటికి సమాధానము చెప్పినాను గాని నాకు నిజము బోధపడలేదు. మీరు సంపాదకులు- వ్యాసరచకులు- సదభిప్రాయ మీయగలరు.

సఖే! ఒకతరగతి స్త్రీలనువినుము..... దేవుని, ప్రియుని యొకేమాదిరి పూజింతురు. ప్రియుడు సంతోషముగ తమను చూచిన దేవుడు వరమిచ్చెనని తలతురు. అందులకే వీరిలో భక్తి విశ్వాసాలు మెండు. వీరు భర్తను స్వయముగనైన తల్లి దండ్రుల యనుమతినైననన్న బడసి లోకోత్తర యనురాగమున భర్తననుసరింతురు. తమ యనురాగమును పిల్లలపై ప్రయోగింతురు. గొప్ప, చిన్న, ధనిక, బీద యను తారతమ్యములేక పతితో తమ యనురాగము లీనముగావించి సుఖము నొందుదురు- పతికై త్యాగమందు వెనుదీయువారుగారు. వీరలను పతివ్రత, సచ్ఛీల, ధర్మపత్ని, గృహలక్ష్మి యని యందురు. వీరి యాశయము తమ యనురాగమనుభవించు యొకే ప్రియుడని. అందులకే నిగ్రహాశక్తి యెక్కువ, యింద్రియపరిసారము తక్కువ. వేద పురాణములపై మక్కువ మిక్కుటము. పతితో సమానముగ దేశమును పూజింతురు. దేశమునకై పతిజేయు త్యాగము ననుసరింతురు- పరలోకమొకటి గలదని నమ్మకము. ఇందే తప్పు జేసిన యందనుభవించవలసి వచ్చునని తలతురు- వీరలు మాతలగుట మిక్కిలి వాంఛింతురు. చంద్రునివలన చీకటి పోవునటుల బాలునివలన తమ దుఃఖములు తొలగునని తలంతురు.

వీరలు వ్యభిచారమును హీనముగ నెంతురు. అది స్త్రీ శీలమునకు చీడపురుగని భావింతురు- వ్యభిచారులను చూచిన

నీసడింపెక్కువ- వారల సాంగత్యము కాలసర్పముతో గూడుట యని తలంతురు. వ్యభిచారముచేన వంశకళంకము, పతి యవ మానము, పుత్రుల నీచత యని నమ్ముదురు.

ఇంక రెండవ వర్గము—

వేశ్య- జవ్వనవిక్రయత బాల్యమున వీరి స్వభావము. పై తరగతివారలకు జెందినను యవ్వనమున యార్థిక పరిస్థితులను బట్టి యీ వృత్తి నవలంబింతురు. ఈవృత్తి హీనమని తలతురు- కాని దీనినివదలి జీవించలేరు. తమశరీరము హీనమని తలతురు గాని ప్రపంచముకొరకు శృంగారము గావించుకొందురు. ప్రతి వాడు వీరలప్రేమ బడసితిమని తలంతురుగాని వీరలలో ప్రేమకు స్థానముండదు. వీరల యనురాగము క్షణికము- ఆడంబర మధి కము- విలాసచూపులు మెండు- విచారదృక్కులు స్వల్పము- జాతి మత వర్ణభేదములు లేవు- ధనమే గొప్ప.

మూడవతరగతి—

వీరు చపలాత్ములేగాక చపలహృదయులు. నాగరికతా యుపాసకులమనితలచి మొదటితరగతివారు సనాతనులని, పురా ణముల భావములు గలవారని, పురుషుని బానిసలని, లేక కీలు బొమ్మలని, స్వాతంత్ర్య హీనులని మొత్తిపొడుచుదురు. రెండవ వర్గమును మిక్కిలి యాదరించకుండినను, వారి యాచరణ లుచిత ములుగావని తలచియు, వారలలో స్త్రీ స్వాతంత్ర్యము గలదని భావింతురు. కేవల సౌందర్యోపాసకులు సౌందర్యమునకై చేయు ప్రయత్నములే వారల యాదర్శములు. పాశ్చాత్య నాగరికత నాకించుక సాధించుటకై ప్రయత్నించు వీర విహా

రిణులు ఇంద్రియములు వారి స్వాధీనములుగావు. మనోనిశ్చయము సున్న. కన్నులకింపగునవి యన్నియు తమ యుపభోగ్యములే యని చాటుదురు. దేశసేవను వాంఛింతురు- మాతలగుట తలవంపులని తలంతురు- గృహిణి ధర్మముల నెఱింగియు నాచరించుటలో వెనుకంజ వేయుచు గర్వించి యందని ద్రాని పండ్లకై యఱ్ఱులు చాతురు.

(మిక్కిలి శ్రమజెందితిరి.

ఇందులో శ్రీమ మొదలకు- కన్నులార చూచినవే- చెవులార విన్నవే.

ఇందులో యుత్తములెవ్వరు?

స్త్రీలను స్త్రీలే వర్గోన్నతి నియమించుకోవలయును.

సెలవు—

అయిదు నిమిషములు నిలుతురని నమ్ముచున్నాను. (సేవకునిఁబిలిచి) కాఫీ తీసుకురా.

ఎందుకులెండి-

అతిధిమర్యాద- యింతైనా లేకుంటే!

అంత కృష్ణారావు కాఫీత్రాగి బయలుదేరుటకులేచి- నా సైకిలు—

(ఆలోచనచేసి) పదిరూపాయిలు!

మీ ప్రశ్నలకు బదులు చెప్పినానుగా!

మీరు చెప్పినదంతావినలేదా! ఎంతకష్టము కూర్చోవడం!

అందుకది సరిపడుతుందా?

మీరు కవులు- అందులకే నా హృదయాన్ని కనుగొన్నారు.

రేపు తీసుకపోతాను.

నడచిపోయిన యాయాసముగాదా?

అది మీదయ- నమస్తే! (వెళ్ళిపోవును)

విమల కృష్ణారావును పొమ్మనుట కిష్టములేకుండినను నిలుపుటకై ప్రయత్నించలేదు.

౧3

మరునాడుదయం గిరీశంనుండి వచ్చిన యుత్తరంచదివి విమల తనలో-

గిరీశం! నీవక్కడ- నేనిక్కడ- సరిపడుతుందా? ప్రేమ జాబులతోనే తనివితీరునా! నా అభిప్రాయమునకు సరిపోయిన వాడవే కాని కాలపరిస్థితులు వేరుపరచ దలచినవి- మన యిరువుర మొకేమార్గమున పోవు ప్రయాణీకులమైనను మన గమనమున కెద్దియో యాటంకము తగులుచున్నటులున్నది. నా అభిప్రాయాన్ని తెలిపిన నన్ను ద్రోహియని తలచెదవు. మిక్కిలి ఖిన్నుడవగుదువు. నీవు నన్నేరీతి తలచినను నా మనస్సును బంధించజాలను. నీవు నాపై వేరభిప్రాయము గలిగినను నాలో ప్రేమ, యనురాగము గలదని తలంచుము నీకు నిరాశ గలుగునుగాని ఆ తరువాత మనశ్శాంతి యుండునని నా యూహ. నా యీ తలంపు హీనము కావచ్చును కాని తరువాత మన యిరువురకు సౌఖ్యము గలుగును.

అని తలచి యా జాబును రహస్య ప్రదేశమున దాచును. తన వాడిన మోము ఇతరులు చూచి పరిపరి రీతుల తలతురని శృంగారము గావించుకొనుచుండెను. కృష్ణారావొచ్చునటుల తోచును- అతను రాగానే చిరునగవున-

నమ్మకమైనవాడవు- ఉదయమన్నవారు సాయంకాలమునకు ప్రత్యక్షమైతిరి.

ఇంతదూరము నడువవలెనంటే యొకింత తక్కువ- (పది రూపాయ లివ్వబోవ)

రూపాయ లుండనీలెండి-

తొందర పడువారు మారినారే! ఇంకా నాశ్రమను చూడ దలచితిరా?

మీకు శ్రమగలిగినదా- అయితే శ్రమపరిహారము గావించెద- (లోపలకుపోయి టిఫెన్ తెచ్చును) శ్రమజెందినందులకు సుఖపడుడు.

నాశ్రమకన్న మీరెక్కుడు శ్రమజెందుచున్నారు. నాకై మీ శ్రద్ధ యేలకో!

పురుషులని- మార్గాయాసము బడసిన సౌందర్యరాసి వని నమ్మకమైన సత్యసంధుడవని- పరులకష్టములు తనవిగా భావించు పరమాత్ముడవని- తెలిసినదా!

ఎన్నడును తలవని సంగతులు నుడివితిరి. మీ చాతుర్యమపారము.

(తినుట పూర్తియైనతరువాత) తోటలోకి వస్తారా? ఇంగ్లాండునుండి కొన్ని మొక్కలను తెచ్చి నాటినాను. వాటి పూలు చాలా యందముగా యుండును.

కుక్కలేమీ యుండవుగా!

మీరు సైకిలుమీద పోవునదేమీ లేదుగా!

ఇద్దరు తోటలో తిరుగుచుందురు. ఒకచోట నొకతీగె చెట్టునకు చుట్టుకొని పైకి ప్రాకియుండుటగాంచి విమల-

ప్రాణము లేనివాటిలోగూడా పరస్పరము కలిసి కూడి యుండుట గలదు- స్త్రీయు దైవసృష్టి- లతవనిత, విద్య యొకరి సాహాయము లేనిది ప్రకాశించదంటారు నిజమేనా?

హా—

(పక్షుల కలకలారవము విని)

ఆపక్షు లేమనుచున్నవో తెలియునా?

తమ యాప్తుడు పోవుచున్నాడని పరస్పరము మాట్లాడు కొనుచున్నవి.

అలాకాదు- శ్రమజెందుకాలము గడచుచున్నది- త్వర లోనే పరమానంద డోలికల తేలియాడ పోవుచున్నామని తమలోతాము మాట్లాడుకొనుచున్నవి. మనలచూచి "వార లెంత జ్ఞానశూన్యులని" తలచి నవ్వుచున్నవి. "మన యనురాగముచూచి నేర్చుకొన వచ్చినారని" గుసగుస లాడుచున్నవి.

(కృష్ణారావు వాటిని రాయితో రువ్వ, లేచి ప్రక్క చెట్టుపై వాలును. విమల వానిని చూపుచు)

ప్రేమజీవులను విడదీయువారెవ్వరు లేరని మనల నిందించు చున్నవి. మనకు ప్రేమలేదని నిందారోపణ గావించుచున్నవి. మన శరీరములు సమీపమున యున్నవిగాని యాత్మలు లేవని తమలోతాము విచారించి దేవుని ప్రార్థించుచున్నవి.

విమలాదేవిగారూ! వాటి హృదయాలను ఇంత చక్కగ తెలుసుకొనుశక్తి యెందు బడసినారో- ఇది నాగరికతాదేశ ప్రభావము కాబోలు.

అంత దూరమెందుకు. ఈ పక్షులే మనకు నేర్పుచున్నవి.

గొప్ప యనుకొను దేశముయొక్క నాగరికత తెలిపినందు లకు కృతజ్ఞుడను. వేళైంది- మందుతీసుకొని పోవాలి.

నాదొక కోరిక నెరవేర్చగలరంటే చెపుతా-

శక్తియుండిన చేయజాలనా!

ఈరోజు నా నాట్యము గలదు. మిమ్ము వెంటగొని పోవలయునని నా యభిప్రాయము. నా నాట్యముపై మీ యభి ప్రాయము గోరుచున్నాను. ఇందులో మీకు కష్టములేదు- నా యభిప్రాయము పూర్తియగునని నా యూహ.

మీ యభిప్రాయాన్ని వ్యతిరేకించ సాహసించజాలను. కాని యింటలో రోగియుండ బయట తిరుగుట యుచితమా! మందు తీసుకపోవాలి- సుశీల నేను లేకుండిన క్షణమైన తాళదు.

స్త్రీల సేవలను వాంఛించు మీరే సేవించుట యాశ్చర్యము. మన మనిషితో మందుపంపుచూ నాటకానికి పోయినా నని తెలుపుదము. ఈరోజు నా నాట్యము బాగుండునది లేనిది మీ చేతిలోగలదు. ఇప్పుడే నన్ను విచారమున బడవేసిన సక్రి

మముగ యాడజాలను. మీరు భారతపురుషులు- మీపై యధికారము చూపించుట యోగ్యతలేదు.

విధిలేక కృష్ణారావు మందు ఇంటికంపి విమలతో నాట్యశాలకేగును. సమయముపై నాట్యము ప్రారంభమగును. కృష్ణారావు ప్రథమవరసలో కూర్చొనియుండును- విమల యతనిని చూచుచు జనముతలచనంతటి నిపుణత చూపును. మేలు, మేలు, అనుశబ్దము ప్రజలలో మారుమ్రోగెను- ఆట ముగియును- కృష్ణారావు విమలకడకేగును.

ఏమండీ! ఏలావుంది?

(కృష్ణారావు బదులు చెప్పకమునుపే మేనేజరువచ్చి)

విమలాదేవిగారూ! ఈరోజు మిక్కిలి ప్రజలను సంతృప్తి బరచితిరి. మా కంపెనీకి సుదినము- మా కంపెనీని తారాపథమునకు గొనిపోయినారు- మీ సహాయాన్ని మరువజాలను.

(విమల చిరునగవున కృష్ణరావును చూచును)

(కృష్ణరావు చిరునగవున) ఈరంభ మీకులభించుటచే మీ నాట్యరంగము యింద్రప్రస్థపురము.

అవునుసార్! నమస్తే (వెళ్ళిపోవును)

కృష్ణరావుగారూ! నన్నింత గొప్పదానిగ జేయించినందులకు మీ మేలు మరువను.

విమలాదేవిగారూ! నేజేసిన దేమిలేదు.

ఇంకా ఏమికావాలి- నాలోయుండే సంతోషాన్ని పెకిలించి పైకుబికించితిరి. నా జవ్వనమును రెండింతలు జేసితిరి.

ఇంతకు నేడు నాజన్మ తరించినది. మాయింటికే రండి- అర్ధ రాత్రి యెక్కడకు పోతారు?

విమలాదేవిగారూ! నాయవస్థ మీకు తెలుసు. తెలిసి బలవంత పెట్టుట భావ్యమా?

ఇద్దరు ఎవ్వరియింటికి వారు పోవుదురు.

౧౪

ఉదయము జ్వరమున మూలుగుచున్న సుశీలకడకుపోయి-

సుశీలా! ఎలావుంది?

కొలదిమేలు- డాక్టరు వస్తాడా?

హాం— ఈరోజు తీసుకవస్తా-

అర్ధరాత్రిదాక యింటికి రాకుంటే నాన్న యేమైనా యనుకోడా?

నీవుండ నాకుభయమా! ఏ దురభిప్రాయాన్ని రానిచ్చు దానవా- నాటకానికి పోయియుంటిని.

బాగున్నదా?

హాం- గడచినరేయి నీకు సుఖము లేదన్నమాట?

రోగికిసుఖమేమిటి! ఛాయ రాత్రి మిక్కిలిసహాయపడినది.

అరే- ఛాయవిషయము చెప్పడము మరచితిని. నేను వ్రాసినదానికి బదులు గిరీశం వ్రాసినాడు.

ఏమని?

బొందిలో ప్రాణమున్నదాక ఛాయను పిలుచుకపోడట. పూర్తి కాఠిన్యము దాల్చినాడు-

కోరినభార్య లభించిన సౌఖ్యమట- నాగరికత ప్రపంచమున ప్రాచీన సంప్రదాయముల ననుసరించుట తలవంపులట- సుమము లెన్నోగలవు- వాటిలో నొక్కొక్కదానిలో నొక్కవిశేషమట. అన్నిపూవులు ప్రతివానిని నాకర్షించజాలవట- ఎవ్వరికేపూవు లాకర్షణీయములో యవి లభించిన మనఃశాంతి గలుగునట- ఇరవైశతాబ్దమున ప్రేమను బంధించ వీలుగలదా యని నన్నుగూడా యడిగినాడు.

మిమ్ముల యడుగకుండిన నెవ్వరినడుగుదును- పాపము ఛాయకు సుదినమురాలేదు. ఎంత ఎగిరేవాడైనా క్రిందబడక తప్పదు. తానొక ఘనకార్యమును చేయుచున్నాడని తలచుచున్నాడు కాని విధి గర్వమడచుటకు వేచియుండును- ఎవ్వడు త్రవ్విన గోతిలో వాడే బడుట సంభవించును.

సుశీలా! నీ నమ్మకమే నాకును గలదు. నీవుచెప్పిన నీతుల నొక్కసారి వ్రాసి చూచెద- వాడు మారునేమో! ఇంకా కొంత వరకు స్నేహితమును ఉపయోగించుకుంటాను- శ్రమపడుట మనవంతు, ఫలము దైవేచ్ఛ. వ్యర్థమని నిరాశజెందుట యుచితము గాదు.

మీ స్నేహితుని గురుత్వము చూస్తానుగా! తెలియనివానికి చెప్పుట సులభము. అన్నీ తెలిసినవానికి బ్రహ్మతరమా- మీ ప్రభావమెంతో నాకేమి తెలియును!

నీకెందుకు తెలియును- కాని—

ఆలోచనెందుకు?

ఛాయకు చదువు వచ్చునా?

సామాన్యముగ- యెనిమిదవ తరగతి చదివినది. బి. ఎ. ప్యాసుగాలేదు.

అంతచదువు ఇప్పుడవసరములేదు. ఛాయచేత గిరీశముకు ప్రేమజాబులు వ్రాయించిన కొంత కార్యసాఫల్యమగునేమో!

ఈ పన్నుగడ మేలు గలుగునదేనా? మీకు నమ్మకముం డిన యాలోచనెందుకు?

ఇంతలో ఛాయవచ్చుచు కృష్ణరావునుచూచి తటాలున యాగును. సుశీల చూచి-

ఛాయా! రా- సరిగ సమయానకే వచ్చావు. కూర్చో- (ఛాయ కూర్చొన) ఇప్పుడే నీసంగతి మాట్లాడు మంటిమి. నీ భర్తనుండి యుత్తరము వచ్చినదిగాని తెలిసిన నీకు విచారము.

(ఛాయమోము విచారముగా గనబడును)

చూచితిరా- ఛాయ విచారము ఎంత కప్పిపుచ్చ దలచి నను మోము బయటపెట్టకుండా యుండజాలదు- ఛాయా! మేమొక పన్నుగడ పన్నినాము. స్వయముగా నీ దీనాలాప ములు భర్తకు తెలుపులేఁ- ఆయన పదులు నొసగినను నొసగ కుండినను తగాదాలేదు. కాని కొన్నియుత్తరములు చూచిన తరువాతనైన మారవచ్చు.

ఛాయ బదులుచెప్పదు కాని వింతగ చూచును. కృష్ణ రావు, విమలనొకరు సైకిలుతెచ్చి యుంచుటగాంచి లేచిపోవును. వాడు——

అయ్యా! అమ్మ సైకిలుపంపినది- మిమ్ములను త్వరగా రమ్మనిగూడా చెప్పినది.

వస్తానని చెప్పు-
ఇప్పుడే వస్తారా?
వస్తానని మాత్రము చెప్పు-

కృష్ణరావునకు విమల చేష్టలు మనస్సునకు రాలేదు. తనలో తాను—

విమల నాపై నే యభిప్రాయము గలిగియున్నదో- ఆమె యవివాహిత- ఆమె నటనలవలన ప్రేమించుచున్నటుల దోచుచున్నది. కాని యా ప్రేమ యేలాంటిదో! జవ్వనముచే విచ్చివీగిన సుమకోమలి. కాని నన్ను నమ్మిన సుశీల కన్యాయము గాదా? సుశీల యుదార స్వభావముల విమల తళుక్కు బెళుకులు తిరస్కరించగలవా? ఛీ- ద్రోహిని సుశీలకు మోసము చేయజాలను సుశీలను వీడనవసరమేమి? విమల నూతన వికసిత కమలము- భ్రమరము లెన్ని కుసుమముల సాంగత్యము పొంది మధు త్రాగుట లేదు- ఛీ- మానవులకు కీటకములకు తేడా లేదా? విమల యొకరి యర్ధాంగి కాలేదు. బహుశా నేను వాంఛించిన వ్యభిచారదోషము రాదుగదా! ఎప్పటికైనను విమల యొకరికి కావలసిన దేగా? విమల ధనికురాలు. తండ్రి కత్యంతప్రియమైన యేక కూతురు- విమలయుండిన సుశీల యుండగూడదా? సుశీల నా యభీష్టాన్ని తీర్చదా- సుశీల యభిప్రాయాన్ని కనుగొందు నా! వలదు- ఇప్పుడే బాధజెందు సుశీల బాధపడగలదు. విమల పలుకులు కోయిలకూతలు కాని సుశీల మాటలోని సుధారసము లేదు. ఆమె యంగసౌష్ఠవ లావణ్య విలాసములు తొణకులాడును కాని సుశీలలోని సహజ సౌందర్యము సున్న నేపథ్య

శృంగారమే విమలమోమున గాని దివ్యతేజస్సు లేదు. అన్ని గుణములలో సాటిలేనప్పుడు విమలను వాంఛించుట తప్పు. సుశీలను బాయజాలను.

ఈరీతి కాలము గడుపుచు సాయంత్రము డాక్టరును పిలుచుక రావడమునకు వెళ్ళిపోవుచు,

మోహన్! అక్కనువదలి పోకు- నీవు మాటలు చెప్పుతుంటే వింటుంది-

హా! నీవు తిరగడానికిపోతే నేనుమాత్రముంటానా?

లేదురా! మందు తేవద్దూ?

మందు నేను తేనా? నేను డాక్టరును చూచాను

నీ వసాధ్యుడవని నాకు తెలుసు. అందులకే మీయక్కకు మాటలు చెప్పమనేది.

మంచిది. త్వరగారా! లేకుంటే నేనుపోతాను.

నీయాజ్ఞ తప్పక శిరసావహించెద.

నాకుకూడా మందు తే-

నీకెందుకు?

నా యాజ్ఞ.

చిత్తముప్రభూ! (పోవుచుండ)

త్వరగా రారా!

రాకుంటే యజమాని కోపపడడా?

అంత కృష్ణరావు విమలయిల్లు చేరును.

సత్యహరిశ్చంద్రులండి మీరు!

విమలా! తప్పక వస్తానని చెప్పలేదుగా?

ఎందుకు చెప్పెదరు? మందు తీసుకొనిపోవు సమయమైతే నేగా జ్ఞాపకమొచ్చేది!

అదికాదు- యింట్లో ఎన్నో పనులు- ప్రతికాలయములో కొంతపనైనా చేయాలిగా!

అంతేలెండి. ఇక్కడమాత్రము మీకు పనులు చూపించ లేననుకున్నారా? ఏపనీ లేకుండానే మిమ్ములను రాగోరినానా! మీకు నచ్చేపని ఒకటి చూపించమంటారా?

అని చిరునగవునయున్న కృష్ణారావు హస్తము పట్టుకొని పోయి తనశయ్యపై కూర్చోబెట్టును. ఆ గదియందు నగ్న చిత్రములు కళాశాస్త్రమును పూర్తిగా తెలుపుచుండెను. ఆదిలో నాగది కృష్ణారావునకు వింత గలిగించక మానలేదు.

విమలాదేవీ! ఈ చిత్రసేకరణకై మిక్కిలి శ్రమపడిన టుల తోచుచున్నది.

బాగులేవా? ఇంగ్లాండు పోయినప్పుడు తీసుకువచ్చినవి. నాపాట వింటారా?

విమల హార్మోనియంపై మధురముగ పాడుచు విలాస చూపులచే కృష్ణారావు ధైర్యమును పూర్తిగా బారదోలుచుండెను. అతనిమోము మారుకొలది విమలసంతోషము మిక్కిలగుచుండెను. తనయుద్దేశ్యము నెరవేరుట కనుకూలము గలుగుచున్నదని పరమానంద భరితురాలగును. చిరునగవున-

ఇంక మందు గైకొనిపోదురా? వేళైయుండును-

కృష్ణారావు తలవని తలంపున "హా" యనును- కాని యందుండి లేవలేదు. మరేమీ మాట్లాడలేదు- దేనినో యాలో

చించువానివలెఁ విమలనుచూడ వాని భావముల గ్రహించి ద్వారమును కృష్ణారావు చూచుచుండఁగనె మూయును. ఆయన కన్నులు భయము తెలుపుచుండెను.

## ౧౫

కొలదిరోజుల తరువాత చక్రపాణి సుశీలతో మాట్లాడు చుండ ఛాయ వచ్చి-

ఏమోనండి- మీరే తగుశ్రద్ధ తీసుకొనకుండిన సుశీల జ్వరము తగ్గుటకష్టము. జ్వరబాధ భరించగలదా లేక ప్రియుని విముఖతబాధ భరించగలదా? అసలే తపించుదానికి దావానల మలముకొనినట్లున్నది. రాత్రంతయు దుఃఖమున గడపుటయే గాని మనఃశాంతిలేదు.

ఛాయా! నాయనతో వారిపై చాడీలు చెప్పుచున్నావా! నాన్నా! ఛాయమాట లసత్యములు. నేను సుఖముగనే యున్నాను. నీవేమీ దిగులుపడకు- ఛాయా! నీకిది న్యాయమా? లేనిపోని యనుమానాలు కల్పించి బాధించకు.

నిజముతల్లీ! ఆ కన్నీరే సమస్తము తెలుపుచున్నది. ఆ తడియారిన పెదవులే నీలోని సంతోషాన్ని తెలుపుచున్నవి. ఆ నీ హీనస్వరమే నీ మనఃశాంతిని తెలుపుచున్నది. సుశీల నామనస్సు కలతజెందకూడదని నీ యుద్దేశ్యమును తెలుపుచు న్నది. చిన్ననాటినుండి నీ హృదయాన్ని చూచిన నాకు తెలి యదా? కన్నులారాచూచి తెలుసుకోలేని యంధుడా నీతండ్రి? అమ్మాయీ! దేవుడెంతకౄరుడు- గాయమున్నచోటనే తట్టు

తగులునా! సుశీలా! (గద్గదస్వరమున) నీతండ్రెంత పాపము చేసినాడో- కన్నబిడ్డల సౌఖ్యము చూడజాలని పాపి.

నాన్నా! మీరు వట్టి భ్రమపడుచున్నారు. మీ యను మానమే నాలో దుఃఖచిహ్నముల తోపజేయుచున్నది. రోజుకు రోజు నా యారోగ్యము వృద్ధియగుచున్నది. నాన్నా! నాకు బాధయుంటే నీకు తెలపనా? విచారించి కష్టపడిన నేను సహించ జాలను.

అమ్మాయీ! ఏతండ్రి నీలాంటి కూతురును చూచుచు ధైర్యముగ వుండగలడు? ఏమీ కష్టములేదని చెప్పినంతమాత్ర మున కనుగొనలేని పాపండుడా నీతండ్రి? నిన్నొకదానినిగా చేయు నాకెన్ని గడ్డు అంతరాయములు గలుగుచున్నవి- నేను కలలోనైన తలచలేదు. ప్రపంచమే మోసము- ఈ జగతిలో యెవ్వరిని నమ్మవచ్చు- నమ్మదగినవా రెవ్వరు? అంతా బూట కము- అందరూ నానారకముల వేషధారులే. ఏసమయమున కేవేషము వేయాలో బాగా తెలుసు. నటకులలో మోసమే ప్రధానము. వేషధారి యైనవాని నిజరూపము కనుగొనగలమా! ఆ మైపూతలే మనకన్నుల మాయజేయును. మైపూతలు తొల గిన తరువాతగదా నటుని నిజతత్వము బయటపడునది!

నాన్నా! (గద్గదస్వరమున) మీరింత తలపోయుట పొర పాటు. అంత దైవసృష్టియైనను చేతివేళ్ళు సమానముగ యుండునా? వాటిలో నొకటిమించిన దొకటియా- నాపై యుండు వాత్సల్యము తప్పుదారిలోకి గొనిపోయినది. నాన్న

హాని చేసినవారెవరు? లేక చేయదలచినవారెవరు? నాదృష్టిలో చెడ్డ యెవ్వరూలేరు- అందరు నన్నుమంచిగనే చూచుచున్నారు.

సుశీలా! నీదృష్టికి యది సాధ్యమగును. కాని ప్రపంచము గూడా చూచునది యున్నది. మంచి, చెడ్డ వ్యక్తి స్వభావములనుబట్టి నిర్ణయింతురు. శునకమును సింహాసనమున గూర్చుండబెట్టిన యది వాంఛించునది రాజ్యపరిపాలనా? లేక యింటింటి యాచననా! నాజన్మలో నొకతప్పుచేసి దానిని సరిదిద్దుకొనుటకు వేరొండుతప్పు చేసితిని. ఈ పాపపిశాచము నా హృదయమును మాడ్చుచున్నది. తాళుట దుర్ఘటము.

నాన్నా! నేడు నీకు పిచ్చిగలిగినది. తెలిసినవాడవు- కష్టములు గలిగినవి. కష్టమే లేకుండిన సుఖమెక్కడిది? ఎప్పటి కొకే రీతి యుండిన కష్టసుఖము లనుటకు హేతువు. ఈ సమయముననేగా మానవుల ధైర్యము- (కన్నీరు గారుచుండును)

మీరు సుశీలతో ఎక్కువ యీలాంటి ప్రసంగము తీయుట మేలుగాదు. మనస్సు చెడుట కెంతకావలయు? ఇప్పుడే చిత్తము స్వాధీనమున లేదు.

ఛాయా! నేనదే యూహింతును- కాని——

నాన్నా! నాకేబాధా లేదన్నానుగా- పత్రికాలయమును మరచిపోతున్నావు. చేయగలిగినదానిని జారవిడుతురా- అమావాస్య చీకటి భయపెట్టిన పున్నమనాటి వెన్నెల సంతోషపరచదా? ఎండకాలము మహాతాపమని నిందించిన యావేడియే వర్షాకాలమునకు మూలముగాదా? ఎంత దారుణదినములైనను వసంతోత్సవములు జరుపరా! నేను నీభ్రమను కలలో

కూడ యనుకోలేదు- నాకై కన్నీటికాలువల బ్రవహింపజేతువా! నాకొరకు చింతించకు. ముమ్మాటికి నాకు కష్టములేదు. నన్ను పెంచినది నాకష్టములు కోరుటకా? అనవసరముగ చింతించిన నన్ను బాధగలిగించినవాడ వగుదువు.

ఎన్నిమాటల సమాధానపరుచుదువు తల్లీ- నాకొరకు నీవెంత తాల్మి దాల్చినను నాకు నోర్మిగలుగునా? నా హృదయము పాషాణముగాదు- నాకన్నులు గాజుముద్దలుగావు- నా చెవులు ఘోరాటవీ గుహలుగావు- ఇవి యింద్రియములు- ఒక ప్రాణివి- నేనొకరికి తండ్రిని- నాకు తండ్రిహృదయము గలదు- సుశీలా! నేనెవ్వరి దుండగములను సహించజాలను- ఆ పిశాచమును రూపుమాపుతాను- (కోపమున) జాగుసేయను. దుండగీడుల దుండగములు మిన్నకుండిన విజృంభించును.

నాన్నా! ఎవ్వరిని? నీకెవ్వరు హానిగల్గించినారు?

నేను చెప్పాలా తల్లీ (గద్గదస్వరమున) ఆ పాపి- నే నే యాశయములతో నిందు జేర్చితినో ఆ క్రూరుడు- వానినేనమ్మి నా సర్వస్వము నొసగ మోసముచేసిన కలుషుని- ఇంట కాలు నిడనీయను. పరిజ్ఞానశూన్యుని, నమ్మకద్రోహిని, ఆ కృష్ణారావును ఇంట కాలిడనీయను. నేడు ముఖాముఖి తెలుపుతా- మార్గమునకు వచ్చెనా సరే, లేకుండిన ఈ యింటికి సంబంధములేదు.

నాన్నా! (ఏడుస్తూ) మీరు వారిపై యీరీతి దాడి వెడలుదురని తలచలేదు. మీరు వారినేమీ అనగూడదని నాయిష్టము. ఎన్నాళ్ళు తిరుగుదురు? నాన్నా వారియనుభవము వారికే యగును- నీవు తొందరెందుకుపడెదవు- ఇప్పటి పరిస్థితిలో నీవు

వారినేమన్నా యన్నావంటే వారు ఇల్లువీడుటకు సిద్ధము. ఈమాత్రపు చిక్కుకై వారల వదలగలమా? నాకొరకైనను వారినేమీ అనవలదు. వారియిష్టము- వారి యానందముకన్న నాకు కావలసినదేమున్నది? వారల సంతోషపరచజాలని అభాగినిని నేనైయుండ వారల నిందించనేల- వారు పూజ్యులు. నా పాలిటి దేవుడు- నేడుకాకున్న రేపైన తప్పక కరుణించెదరు.

(పట్టరాని దుఃఖమున) ఏమి నీధైర్యము తల్లీ- ఇంతటి యుదార స్వభావురాలవు పూర్వపాపఫలమున యీయింట జన్మించితివి- వాడు కరుణించడు- వానికి కరుణ శూన్యము- నేను నమ్మను- నీనుండి వానిని విడదీయ యా నీచురాలు ఏదేశమున యీ నైపుణ్యాను నేర్చుకున్నదో? ఈ కార్యము సాధించుటలో యా పిశాచికి ఘనమా లో కాపవాదులు వారలచెవుల దూరవా- ఏమైననుసరే యింటికిమాత్రము రానివ్వను- నీవు నన్నెంత కఠినుడని తలచినను నేను విచారించను. తగిన ప్రాయశ్చిత్తము చేసిన గాని నాకు తృప్తి లేదు. (దుఃఖమున మాటయాగ)

నాన్నా! నీవు చెప్పినమాట నెరవేర్చెదవు. వారు వినిన మాట నెరవేర్చెదరు- నీ యభీష్టము నెరవేరునా- నీ వెవ్వరికొర కీతాపత్రయము పడుచున్నావు- నీకొరకా? కాదు- కాదని నాకు తెలుసు. నీకైన నీవింత శ్రమపడవు- నాకొరకై నీవింత భారమును మోయుచున్నావు- నా యభీష్టము నెరవేర్చుట యన్న నీకత్యంత ప్రమోదము- చెప్పరానంతటి యభిప్రాయాన్ని కలిగిన నీవు నాయొక్క కోరికను, నా యానందాన్ని పటుకూర్చమన్న సిద్ధపడవా? నాకిందులో యానందములేదని

నీకెలా తెలియును. భారతస్త్రీలకు ప్రియుని ముఖావలోకన మునకన్న యానందము సమకూర్చునది యెద్ది? బంగారునగలు, పట్టువస్త్రములు, ఉన్నత సౌధరాజములు తృప్తిపరచునా- యోచించు- ఎంత బీదకుటుంబిని యైనను, సూర్యచంద్రాదులు తాండవించు జీర్ణకుటీరముల నివసించు గృహిణి యైనను, పొట్ట కూటికిలేక పస్తుపడన్నము కై పరితపించు ఏ భారతకులాంగన ప్రియుని వాల్లభ్యమునుబడసి తృప్తిజెందుటలేదు. ప్రియుడెందు తిరిగినను నొక్కసారి తనివారచూచిన పరమానందభరితురాలు గాజాలదా? భారతావని పుణ్యభూమి- భారతస్త్రీలు తమ త్యాగమువలన లోకోత్తరప్రేమను నిరూపించుదురు. దివ్యప్రేమ ఏదేశమున గలదు- నాన్నా! నీకెన్నిసార్లు చెప్పినను వారినేమ నకుడనియే. నా యానందమిదియే- నా భావి భాగ్యోదయ మిందే గలదు.

(ఇంతలో మోహను పరుగెత్తుచు వచ్చి

నాన్నా! బావ వచ్చినాడు.

చక్రపాణి మండిపడును. వెంటనే సుశీలకన్నీరా మంటను చల్లార్చును- సుశీల మెల్లగ

మోహన్! బావను పిలుచుకురా-

మోహను బావను పిలుచుకువచ్చును- అందరూ విచార మున యుందురు. కృష్ణారావు-

సుశీలా జ్వరమెట్లున్నది?

ఏమీలేదు...........ఇలారండి (రాగా తనప్రక్క కూర్చోబెట్టుకొని దీనముగ చూచును- తండ్రి యధోముఖుడై యుంట చూచును- ప్రియునితో)

పోమేవారేలాగైనా పోతారు- నా రెండుమాటలు విన గూడదా- జ్వరబాధ ననుభవించు నన్నువీడి రోజూ యింటికి రాకుండిన ప్రజలేమనుకుంటారు- నాకొరకు మీరశ్రద్ధ చూపిన నాగతి? మీ సంతోషమే నా సంతోషము- వేరొండు స్త్రీతో సంతోష పడుచున్నారను అసూయ నాకులేదు. మీ సంతో షాన్ని మీరు నిర్ధారణ చేసుకొనుటకు మీకు హక్కుగలదు. మీ ధర్మాన్నిగూడా నెరవేర్చలేరా- ప్రపంచానికి భయపడ వలదా- మీరొచ్చిన దెవరికొరకు? ఏ ఘనకార్యము చేయవచ్చి నారు- తుచ్ఛకామోద్రేక మణచుకొన వచ్చితిరా- ఇదే మీ ముఖ్య యాశయమా- మన దేశాచారాలు, ఇతర దేశాచారాలు తెలుసుకున్నారు- మీరే నాకు బోధించెడివారు- కాని మీలో మార్పు విచారనుగాదా- మీరే యశ్రద్ధచూపిన పత్రికాలయ మేమగును? దాని నాశనమే మీ యభీష్టమా- లోకులు చూచిన నవ్వరా- (పట్టరాని దుఃఖమున) ఊరకున్నారేల- చెప్పండి-మీ యభీష్టమెద్ది?

ఈ యుపన్యాసము వినిపించుటకేనా పిలిపించినది- పత్రి కాలయమునకేమి- నడచును. మీనాన్న యున్నాడుగా- అప్పు డప్పుడు నేను చూచుచునే యున్నాను. డాక్టరును పిలుచుకు రావాలా-

ఏమీవలదు- నాకు నెమ్మదైనది- మీరింట్లో యుండిన మందిచ్చినట్లే!

(చక్రపాణి మెల్లగ) కృష్ణారావూ! మమ్ములనీవు సరకు గొనకపోయినను సరే, నీదానినై యుండగోరు ఆ రోగినైన చూడు- ప్రవాహమున కొట్టుకొనిపోవు మాకు దరి లభించినదని తలచియుంటిమి. కాని (దుఃఖమున ఆగి) నిన్ను నిందించుచున్నామని తలచకు- పదిమందిలో మర్యాదగా జీవనము గడప వలసినవాడవు- నీకు నీవే యోచించుకో-

(కృష్ణారావునకు కోప మతిశయించెను) మీ యనుమానా లేమో బోధపడినవి- నన్నేమి మీ దాసునిగా తలచినారా? మీ కంత కష్టమని తోచిన నేడే పోవసిద్ధము.

(సుశీల దీనముగ) మీరు నాపై కోపపడిన న్యాయము వారలు మిమ్ముల నేమన్నారు- ఎందులకీ విపరీతవైఖరి- మిమ్ముల నెవ్వరైన యన్యథాతలచిన మాకు కష్టముగాదా- మీధర్మాన్ని నిర్వహించమని తెలుపుటకుగూడా యధికారము మా నాన్నకు లేదా? నేనున్నానుగా- మీ కోపమును భరించుదానను-

(రాముడు) ఆ దేవత కన్నీరుచూడండి- ఆమె యాస్థితి మీకు కనికరముగల్గించదా- నాపై కనికరముచూపి మనిషిని చేసినారు- ఆమెపై మీకంత కాఠిన్యమా- బాబూ- ఈ సేవకుని ప్రార్థన మన్నించాలి.

(కోపమున) ఇంకా యున్నారా! ఏదైనా ప్రార్థన లుంటే కానియ్యండి- ఛాయా! నీవుమాత్ర మెందుకూరకే యున్నావు- మీరంతా నాకీ నీతులు చెప్పడానికే కాచుకొని

యున్నటుల తోచుచున్నది. పాపము నాకై యెంత శ్రమ పడినారు- నివేదికలంతా పూర్తియైనవా?

మీకోపమందరిపై ప్రయోగించుచున్నారా- మీ ఇష్టాన్ని వలదనువారెవ్వరు?

పీడ తెగింది- నేనుపోతాను. మామగారూ! పత్రికాలయమును జాగ్రత్తతో చూడండి.

(సుశీల) తిరిగి యెప్పుడు రావడము?

అదిగూడా నీకు చెప్పవలయునా- నా యిష్టముండిన-

త్వరగా లేచిపోవును. సుశీల యత నగుపడునంతవరకు కన్నీటిలో గాంచును. ఇంతలో నొక యుత్తరమువచ్చును.

నాన్నా! యెవ్వరువ్రాసినారు-

గిరీశం-

గిరీశమా! ఏమని వ్రాసినాడు-

ఛాయ మోమొక్కసారి వికసించును. ఆ కన్నులు దేనినో యాచించెను- ఆమెచెవులు దేనినో వినగోరెను. కాని ఛాయనుచూచి చక్రపాణి-

విధి—(నిట్టూర్పున)

ఏమినాన్నా-

కృష్ణరావు వ్రాసిన యాజ్ఞను శిరసావహించ జాలనందులకు క్షమాపణ తెలుపుకున్నాడు. ఎంతటి పాషండహృదయులీ స్నేహితుల జంట.

నాన్నా! గదిలో ఆ యుత్తరాన్ని యుంచు.

ఛీ! ఈ పాపి ఉత్తరము మన ఇంట్లోనా- యిప్పుడే కాల్చివేస్తా.

నాన్నా! నీవలా నిందించిన ఛాయ యేమనుకుంటుంది- ఆమె హృదయమునకు బాధకలగదా?

వీరల నిందించడమా- శరీరములు ఖండఖండలుచేసి కాకులకువేసినా పాపములేదు.

నాన్నా! ఆ యుత్తరమేది-

ఉత్తరము తీసుకొని తనకడ నుంచుకొనును.

౧౬

విమల పేపరు చదువుచుండును. కృష్ణారావునుచూచి-

ఈరోజేలాగో యున్నారు-

అంటే?

రోజుటి సంతోష మగపడుటలేదు- ఏదో గొప్ప చిక్కుగలిగినట్లున్నది-

కాకుంటే నాకా సుఖము, సంతోషము-

హా (దగ్గరకొచ్చి విలాసమున) ఏమిలోటు జరిగినది- మిమ్ముల నెవ్వరేమన్నా యన్నారా? నాన్న యేమన్నా యన్నాడా? లేక నావలన ఏమైనా దోషముగలిగినదా-

విమలా! మీయింట్లో సుఖముగనే యున్నాను- కాని... నాకీ యూరిలోయుంటే సౌఖ్యము లేదేమో!

ఏ పిశాచములు మిమ్ముల బాధించుచున్నవి- వారలెవ్వరు? తుదముట్టింప ప్రయత్నము గావించెద- మీకు పగయైన నాకు పగవారుగారా! వారు మీకు పగయగుటకు కారణము?

(విచారమున) వారెవ్వరూగారు- ఇంటివారలే- వారు నన్ను బానిసగా తలచినారు- బ్రతుకలేక యిక్కడకొచ్చినానని వారి యభిప్రాయము. నాపై యుత్తరువులు ప్రయోగింతురు.

ఇంతదానికా విచారము- నిర్మొహమాటముగ చెప్పడానికి భయమా? మిమ్ములపెంచి సాకినవారా భయపడుటకు- నీ యభిప్రాయాన్ని చెప్పి రావలసినదే.

నేడు నీవన్నది జరిగినది. గట్టిగా మాట్లాడిన కన్నీరు కార్చుటమువినా వేరే తోచనేతోచదు. రోగమున చావనున్నను నాపైననే చింత- అగపడినప్పుడంతా "వదలిపోతారా" యని యడగడమే- అబ్బా- తల తిరిగిపోవుచున్నది. రాత్రి పగలు ఒకటే గోడు.

అవును. భారతదేశమున స్త్రీలకీవిద్య చిన్ననాటినుండీ నేర్పుదురు. వారూ మానవులేగా! ఒకరినియాచించడము దేనికి- అనాగరికదేశము స్త్రీలేరీతి జీవించాలో వారలకు తెలియనే తెలియదు. ఎందుకు తెలియును- నాల్గుగోడలమధ్యపుట్టి యందే గిట్టుదురు. ఇల్లుకదలి ప్రపంచాన్ని చూచినగా స్త్రీ స్వాతంత్ర్యము, స్త్రీహక్కు తెలిసేది- ప్రేమించుట, దుఃఖించుట, త్యాగముచేయుట వినా వారలకు తోచునదేదీలేదు- అందులకే స్త్రీలు వంటయింటి బానిసలు.

కృష్ణారావునకు విమల పలుకులు ములుకులరీతి నాటుచుండెను గాని యామె మోముచూచి యానందపడుచుండెను. విమలమాటలు జన్మభూమి సంప్రదాయమునకు వ్యతిరేకములైనను, ఆమె నోటినుండి వెడలుటచే వేదవాక్కులుగ తోచు

చుండెను. పూర్వుల వ్యతిరేకనడవడిక గలవారినిచూచి మండి పడువాడే కాని విమల లావణ్యాయంగముల కాంతిచే ముగుడ య్యెను. దేశాచార విరుద్ధములనుండి దూరము తొలగువాడే కాని విమల దేహ సౌకుమార్యముపైయుండు వాంఛచే తొలగ లేదు. విమల చాతుర్యమున సభ్యత యసభ్యత పరిజ్ఞానము వీడి యింద్రియలోలుడాయెను. విమల వినా యతని కగపడువా రెవ్వరూ లేకుండిరి. ఆమె కుటిలస్వభావములు వినా రుచించు నవి యెవ్వియు లేకుండెను. కృష్ణారావు విచారమున-

విమలా! నీవు వినా యీయూర నన్ను సంతోషపరచు వార లెవ్వరూలేరు. నా ఆప్తురాలవు నీవొకర్తవే. వారల యా కన్నీరు భయానక యాకారములు నాగుండెలు పగులగొట్టు చున్నవి. వారల బాధలకు తాళలేక నీ సహాయమునకై వచ్చి నాను. నీవేదారిచూపిన నేనందే నడుతును.

(కృష్ణారావు వడిలోవాలి) ప్రియా! నేనుండ నీకేమి భయము- మీకెవ్వరింటిలో నేమిపని- పుస్తెకట్టిన భార్య కాదు గదా సుశీల- అదియునుగాక వితంతువు. మీరు వారింటికి వచ్చి నారు- ఆశ్రయమిచ్చినారు- ఇష్టముండిన వీడవచ్చును-ఈయూర మిమ్ము యాదరించువారే కరునా! ఈ స్వల్పమునకై విచారించ తగునా- విమల సదా మీ సన్నిహిత సౌఖ్యము వాంఛించు చున్నది. మీరీయూరు వదలిన విమల యేమికావాలి? పురుషులు నమ్మకద్రోహులని నమ్మవలసినదేనా! వారు ప్రేమయనురాగము లేని విషాదకులని తలచవలసినదేనా? మనోహరా! నిన్ను నే మరువజాలను- నా పూర్వపుణ్యఫలమున నిన్ను పొందినాను.

నన్ను మోసముచేసి పోయినను మిమ్ముల వదలను. నా హృదయమున మీ స్వరూపమే కూర్చొనియున్నది. ప్రియా! సమాధానము చెప్పండి-

విమలా నీ యనురాగముబడసిన నేను ధన్యుడను. నేను సుశీలను వదలదలచినను సుశీల నన్ను వీడుటలేదు. నాకై యాహారమువీడి యలమటించుచున్నదని పలువురు చెప్పుచున్నారు. దానిమాయలో జిక్కిన నన్ను ప్రజలు నిందించుట సహజము కాని యేపాపమెరుగని నిన్ను నిందించుట సహించలేకున్నాను- ఈ నాజన్మ నిరర్థకము- విమలా! నిన్ను వీడిపోయిన నన్ను నిందించకు.

ప్రియా! వినజాలను- మీ హృదయబాధ నేడునాకు పూర్ణముగ బోధపడినది. మీలాంటి యుదారస్వభావుల బాధించెడి యా సుశీలగుణము లెంతనీచములు- ఆ నీచురాలీ ప్రపంచమున యుండినయేమి లేకుండినయేమి? మనోహరా! ఆ నీచురాలు ఆ రోగముననే నశించనీ- నీపీడ నా యాయాసము పోతుంది.

విమలా! ప్రపంచమున నీచుడనై నివసించిన లాభము? ప్రాణము బాయుటే శ్రేయస్కరము.

ప్రపంచాన్ని మీరు లెక్కచేయుదురా- విమల దృష్టిలో మీరు దోషులా! విమల మీసుఖదుఃఖముల పంచుకొను భాగస్వామి గాదా? ప్రియా యని పిలుచు విమల మీకడయుండ మీ కితరులతో యవసరమేమి? మనకీ సామ్రాజ్యమే ప్రపంచముగాదా? ఇందు మన పగవారెవ్వరూ లేరు.

(తోటమాలివచ్చి)

బాబూ! మీకోరకు రాముడొచ్చినాడు.

(విమల దిగ్గునలేచి బయటకొచ్చి)

ఏమిరా?

అయ్య యున్నారా?

ఎందుకు?

నేడు శరీరస్థితి బాగులేదు- చూచిపొమ్మని చెప్పడానికి:

హాఁ- వస్తాడులే- మందుసీసాయేది- మందు తెచ్చియిస్తాను తీసుకొనిపో-

ఈమాటలు కృష్ణారావు వినుచు- అందేయుండును. విమల మందు తెచ్చుదానిమాడ్కి పోయి విషమును తెచ్చి యిచ్చును. వాడు——

అమ్మా! అయ్య యేమన్నాడు?

పడుకున్నాడు- లేచినాక చెపుతాను- త్వరగా మందు తీసుకొనిపో జ్వరము తగ్గుతుంది-

రాముడు మందుతీసుకొని పోవుచుండును. విమల తన యభీష్టము నెరవేరెనుగదా యని యొక్కసారి యెనువిరుచును. సంతోషమున యందు నిలువజాలక ప్రియునికడకు పోవును. రాముని వెంట కుక్కపడును- భయమున నిటునటు పరుగెత్తుటచే సీసా క్రిందపడి పగిలిపోవును. రాముడు దానిని విచారమున చూచుచు పోవును.

౧౭

సుశీలస్థితి విషమించియుండును. చక్రపాణి, ఛాయ, రాముడు, మోహను కూర్చొనియుందురు. హీనకంఠమున సుశీల-

నాన్నా! వారు వచ్చినారా?

లేదు. రాముడిప్పుడే పోయివస్తాడు.

నాన్నా! నేను జీవించజాలను- నాకన్నులు తిరుగుచున్నవి.

ఎందుకంత భయము తల్లీ!

నాన్నా! ఒక్కసారి దయయుంచి రమ్మని తెలియజేయండి.

(కన్నీటితో) సుశీలా!

నాన్నా! ఏడుస్తున్నావా?

(ఛాయ) మీరామె నధైర్యపరచకండి- హృదయము చెడిపోతుంది-

ఛాయా! నీకుపిచ్చా? నాహృదయ మెందుకుచెడిపోతుంది?

సుఖముగ పడుకో-

నాకా సుఖము- నేనిప్పుడో మరుక్షణము దానినో-

అమంగళవాక్కులు తీయకు- త్వరలోనే దేవుడు దయ చూడగలడు.

ఛాయా! ఎక్కడి దేవుడు- ఎక్కడివరములు-

(వాకిలి శబ్దమగును- చక్రపాణి వాకిలితీసి)

ఎవ్వరికొరకొచ్చారు?

కృష్ణారావుకొరకు.

గిరీశంబాబూ! మీస్నేహితుడింటినుండి వెళ్లిపోయినాడు.

యెక్కడకు?

యెక్కడ తావులభించినదో యక్కడకే!

ఛాయ గిరీశం యను శబ్దమువిని త్వరగావచ్చి తలుపు చాటునుండిచూచెను.

చక్రపాణిగారూ! మీయింటికి నేడతడు వచ్చిన నా సంగతి తెలపండి- నమస్కారములు.

అని వెళ్ళిపోవును. తలుపుచాటునయున్న ఛాయనుచూచి

ఛాయా! నీప్రియుడు పోవుచున్నాడు- మీరేఘడియలో జన్మించితిరో యీ పిశాచములు వెంటబడినవి- వీరలు నాగరికులు-

(వారలు సుశీలకడకొత్తురు)

నాన్నా! వారేరీ?

కృష్ణారావుకాదు వచ్చినది- గిరీశం!

ఛాయా! నిన్ను చూచెనా?

ఛాయకంత యదృష్టమా తల్లి-

అటునుండి గిరీశం విమలయింటికి పోయి యధాప్రకారము లోనికి పోవుచుండ నౌకరొచ్చి-

బాబూ! పోవలదు.

ఏమి- మాలీ! కన్నులగపడుటలేదా?

మీరెవ్వరో తెలుసు- లోపలకుపోవడానికి యనుమతిలేదు-

నా కెవ్వరియనుమతి కావాలి?

మీరేకాదు బాబయ్యా- డాక్టరుగారొచ్చినాగూడా!

అనుమతి యిచ్చేవారెవ్వరు?

విమలా దేవిగారు.

హా——హా (నవ్వుచు) నాకు విమల యనుమతియా? మాలీ! ఈసంగతి విమలకు తెలిసిన నీ నౌకరిపోతుంది- విమలా దేవివల ననే నాకుపని.

బాబూ! నామాట వినండి- ఆమె యిప్పుడెవ్వరితో మాట్లాడదు.

నేనొచ్చానని తెలియజెయ్యి.

ఇప్పుడు లోపలకు పోవడానికి వీలులేదు-

యెందుకురా?

యెందుకోలెండి- తరువాతవచ్చి మాట్లాడండి-

ఏమిచేయుచున్నది (రూపాయి యిచ్చి)

కృష్ణారావుగారితో మాట్లాడుచున్నది- యెవ్వరిని లోపలకు రానివ్వగూడదని యుత్తరువు.

హా! నేను పోతానుగాని- మాలీ! ఇలారా (అని ప్రక్కకు పిలుచుకపోయి చెట్టుక్రింద కూర్చొని)

ఏ కృష్ణారావు?

ఒక పత్రిక సంపాదకుడు.

ఇప్పుడే వచ్చినాడా లేక యిప్పుడప్పుడు వస్తుంటాడా?

అప్పుడప్పుడేమి- ఎప్పటికిఉంటాడు.

విమలకు ఆయనకు స్నేహమా?

ఇంట్లో యెప్పటికిఉంటే స్నేహమెందుకు? పోతాను బాబయ్యా-

మాలి పోవును. గిరీశం నిలువలేకపోయెను. భూమం తయు గిఱ్ఱుని తిరిగినటుల తోచును- కోపాతిశయమున యందుండి వెళ్ళి పోయెను.

౧౮

నాటి సాయంత్రము——

మీరింటికి పోయి వస్తారా?

ఏమిపని?

సుశీలకు జ్వరమెక్కువైనట్లు తెలిసినదే!

యెవ్వరైనా మనిషివస్తే పోతాను.

(మాలివచ్చి)

రాముడు మీకొరకొచ్చాడు-

(కృష్ణరావు వెలుపలకొచ్చును- చెప్పజాలక కన్నీటితో నిలుచును)

యెందుకొచ్చావు రాముడూ?

అయ్యా! (గద్గదస్వరమున) అమ్మ కొలదిగంటల మనిషి- పదేపదే మిమ్ముల పలవరించుచున్నది. ఆమె సంతోషపడుట కొక్కసారి యింటికిరండి- యిప్పుడు చూడకుండిన యింకచూడ జాలరు.

మందిచ్చుటలేదా?

తీసుకుంటేగా! మిమ్ముల తలచుటలోనే కాలము గడుపు చున్నది బాబూ! నావెంటరండి.

కృష్ణరావు విధిలేక రాముని వెంబడించెను- సమయము నకై వేచియుండిన గిరీశం వచ్చి-

మాలీ! విమలాదేవి యుండా?

ఉంది-

తెలియజెయ్యి-

(వాడు లోపలకుపోయి వచ్చి) రండి (అనిన గిరీశం లోపలకు పోవును. విమల)

యెప్పుడు రావడము గిరీశం!

ఇప్పుడే-

క్షేమమా?

హాఁ- నీవు క్షేమముగా యున్నావా?

(నీ వనుపరకు విమలమోము మారుట గ్రహించి)

ప్రియా! ఉత్తరాలు వ్రాయడము మానితివా?

(కోపమున) యెప్పటికి యొకేరీతి- మర్యాద యవసరము లేదా?

విమలా! నేడేలకో నీలో మార్పుగలిగినది- నీవునాప్రియురాలవు గావా? నేను నీకు ప్రియునిగానా?

చష్- ఈరీతి యవినీతిమాటలు పనికిరావు- (నగవు నటించుచు) ప్రియా! మరి యేమని పిలువవలయునో తెలుపగూడదా!

(మోముమాడ్చి) వచ్చినసంగతేదో కానియ్యి-

నేను నీకడ కెందుకొచ్చేది- పోయినసారి యొక రిజల్యూషన్ ప్యాస్ చేసియుంటిమి. అదెంతవర కాచరణలో పెట్టితివో కనుగొనవలదా?

ఆ పాతసంగతులు పోనియ్యి- ప్రస్తుతవిషయ మేమిటో తెలుపు- నేను పోవలసియున్నది.

మన యిరువురి పెండ్లి-

పెండ్లి లేదు-గిండ్లి లేదు- నీ సందేహము నివర్తి చెంది నదా- ఇక సెలవు-

విమలా! అంత తొందరేల- యెంతమర్యాద నాకొరకై పాటించెడిదానవు- కోపము చూపుచున్నావు.

గిరీశంగారూ! లేనిపోనివి మాట్లాడడానికి సమయము లేదు- టెనిస్‌కు పోవాలె.

విమలా! నీ విముఖతకు కారణము తెలిసినది-

ఏమి తెలిసినది?

రైలునందు దిగేవారు దిగిపోతుంటే యెక్కేవారెక్కు తుంటారు-

అంటే-

గిరీశం పోయినాడు- అతనిస్థానాన్ని కృష్ణరావు తీసు కున్నాడు- విమలా! ఒకని కాశచూపి రెండవవాని ఒడిలో పడుట ధర్మమా? పువ్వులపై భ్రమరములు తిరుగుట సహించక భృంగములుగూడా తిరుగుచున్నవి- ఈ పరివర్తన మనదేశమున వ్యభిచారము గాదా? ఇది స్త్రీలోకములోని క్రొత్త వెలుగని తల చుచుంటివా- వేశ్యలు తమపొట్టకొరకు శీలాన్ని యమ్ముకుం టారు- నీవు ధనికురాలవు- నాగరికతచే విఱ్ఱవీగినదానవు-అందు లకే యెవ్వరైనను యుప్యాయముగ నుపయోగించుకొనదలచిన సమ్మతించితివి- పేరులోని విమలత్వము నీలో యేది?

(కోపమున) మర్యాద పాటించమని ప్రథమముననే చెప్పి తిని. స్త్రీలు మట్టిబొమ్మలనుకున్నావా? మీ యిష్టమున్న యాలంక

రించడానికి, నాశనపరచడానికి- మాలో హృదయము: రక్తము చైతన్యము గలదు- మాకుగూడా కామములుండునని తెలుసుకో- గుడ్డివారముగాము- మీరు త్రోవచూపినటుల నడచుటకు- మా దారిని మేము కనుగొంటాము- మా దారిలో మంచిచెడ్డలు మాకు తెలుసు- నాగరికుల మనిపించుకొనిన మాకు మీసలహా యనవసరము.

విమలా! స్త్రీ స్వాతంత్ర్యము పూర్వులే గుర్తించినారు. స్త్రీలు పతులవెంట యుద్ధరంగమున కూకినారు- పతియన్న ప్రాణమునైన యిచ్చినారు మహాపదలయందు పతులకు భుజమై వెంటనంటిన భారత వీరయోధినులు గడువలేదా? వారలందరు కంటికగపడినవారిని వెంబడించిరా- వారలకు స్త్రీ స్వాతంత్ర్య ములేదా- ఏకధాటిగ రాజ్యపాలన చేయునప్పుడు వారలకు స్వాతంత్ర్యములు లేకుండెనా- అంతమాత్రమున వారు ప్రియుల తిరస్కరించిరా- నాల్గుగోడల మధ్యనుండి వలపులచే యితరుల నాశనపరచు ప్రభావము గలిగినంతమాత్రమున స్వాతంత్ర్య మనుకుంటివా? విమలా! నీ కామప్రవాహము హిమాలయ శిఖర ములనుండి ప్రవహించుచున్నది- నాకు నీతి బోధించినందులకు కృతజ్ఞుడను. మీ నాగరికత- మీ రూపలావణ్యము మరచుటకై ప్రయత్నించెద- సెలవు. సమయముండిన తిరిగి కలిసెద.

అటనుండి గిరీశం కృష్ణరావింటికి వచ్చును- కృష్ణరావు విమలయింటికి పోవ సిద్ధమగుచుండును-

గిరీశం! యెప్పుడు రాక?

ఇప్పుడే-

రా (తనగదికి పిలుచుకపోయి) అంతా కులాసాగా యున్నారా?

హాఁ—మీరు?

అంతా బాగాయున్నారు.

ఎక్కడకు పోవ సిద్ధమైనావు?

పనియుంది-

స్నేహితుడు వచ్చాడంటే యింట్లో యుండగూడదా? నాకుగూడా యెక్కడా పనిలేదు వచ్చినపని యేదో పూర్తైనది. నేడు మకాం మీ యింట్లోనే!

(తికమకపడి) దానికేమిలోటు- రా-భోజనం చేదాము.

(యిద్దరు భోజనము చేతురు)

గిరీశం! సినీమాకు పోదామా?

యెక్కడకూవద్దు- హాయిగ పడుకుంటే చాలు- నన్ను గూర్చి నీవుకూడా యెక్కడకూ పోకూడదు-

(విచారమున) సరే- రాముడూ! నాగదిలో మా యిద్దరకు పరుపులెయ్యి.

సరే బాబూ-

ఇద్దరు పోయి పడుకుందురు- అర్ధరాత్రి ఆకాశమంతయు కారుమబ్బులచే యావరించి యుండెను- గుండెలు పగులునట్లు మేఘగర్జనలు మ్రోగుచుండె- కన్నులు మిరుమిట్లుగొల్పు మెరుపులుండెను- ఎడతెరిపిలేని వాన కురియుచుండెను- ప్రపంచమంతయు నంధకారము- ఒక్కరుగూడా లేవ ప్రయత్నము చేయజాలకుండిరి. గిరీశం కృష్ణరావు పడుకొని యున్నాడనిగ్రహించి

యేమిహాని చేసినావా? నా సౌఖ్యాన్ని, నా ఆనం దాన్ని లాగుకొని నన్ను బికారి చేసినావు. నా ప్రాణాన్ని తీసివేసినావు.

(ఏమీ బోధపడక) నీమాటలు బోధపడలేదు.

నానుండి నా విమలను లాగినావు- దీనినిమించిన యప కార మేమికావాలి- చిన్ననాటి స్నేహమునకు యంతరాయము కల్పించినావు.

విమల నీ స్నేహితురాలా? తెలిసింది. నేను నీకు మహా పరాధము చేసినాను- ఈ యపరాధానికి చంపినా పాపము పోదు-కాని నేనుచావకముందు కొన్ని సంగతులు చెప్పెద. రా!

తన భార్యయుండు గదిలోకి పిలుచుకపోవును.

సుశీల మంచముపైనా, చుట్టూ ఛాయా, చక్రపాణి, మోహను, రాముడు పరుండి యుందురు. ఛాయనుచూచి గిరీశం వెనుకంజ వేయును.

గిరీశం- భయములేదు రా!

ఇదిగో మరణశయ్యపై బరుండిన సుశీల- అదిగో నీ ధర్మ పత్ని. మన యిరువురికొరకై నేటివరకు విలపించుచున్నారు. మన యిద్దరమూ యింట్లో పడుకొనిన సంగతి తెలిసి హాయిగ పడుకున్నారు. మన సౌఖ్యముకొరకు మనప్రియు లనిపించుకొని నందులకు సర్వము త్యాగముచేయు సిద్ధపడినారు. వీరి యా యమర ప్రేమ, యా పవిత్ర భావములు మనల రక్షించినవి. వీరలే దేవతలు. ఆ నాగరికుల నిందలుదాల్చిన పరమ పావనులు. తమ శీలమే తమను కాపాడునని నమ్మిన ప్రేమజీవులు.

యేమిహాని చేసినావా? నా సౌఖ్యాన్ని, నా ఆనం దాన్ని లాగుకొని నన్ను బికారి చేసినావు. నా ప్రాణాన్ని తీసివేసినావు.

(ఏమీ బోధపడక) నీమాటలు బోధపడలేదు.

నానుండి నా విమలను లాగినావు- దీనినిమించిన యప కార మేమికావాలి- చిన్ననాటి స్నేహమునకు యంతరాయము కల్పించినావు.

విమల నీ స్నేహితురాలా? తెలిసింది. నేను నీకు మహా పరాధము చేసినాను- ఈ యపరాధానికి చంపినా పాపము పోదు-కాని నేనుచావకముందు కొన్ని సంగతులు చెప్పెద. రా!

తన భార్యయుండు గదిలోకి పిలుచుకపోవును.

సుశీల మంచముపైనా, చుట్టూ భయము, చక్రపాణి, మోహను, రాముడు పడుండి యుందురు. భామనుచూచి గిరీశం వెనుకంజ వేయును.

గిరీశం- భయములేదు రా!

ఇదిగో మరణశయ్యపై బరుండిన సుశీల- అదిగో నీ ధర్మ పత్ని. మన యిరువురికొరకై నేటివరకు విలపించుచున్నారు. మన యిద్దరమూ యింట్లో పడుకొనిన సంగతి తెలిసి హాయిగ పడుకున్నారు. మన సౌఖ్యముకొరకు మనప్రియు లనిపించుకొని నందులకు సర్వము త్యాగముచేయ సిద్ధపడినారు. వీరి యా యమరప్రేమ, యా పవిత్ర భావములు మనల రక్షించినవి. వీరలే దేవతలు. ఆ నాగరికుల నిందలు దాల్చిన పరమ పావ నులు. తమ శీలమే తమను కాపాడునని నమ్మిన ప్రేమజీవులు.

ఇప్పటికే మనము వీరలకు మహాపరాధము గావించినాము- నేటి నాగరికత యని విమలను బొందగోరుటలో వీరి పవిత్ర ప్రేమలనుండి దూరమైతిమి- కాని వీరి యాశాలతలు యంతము కాలేదు. మనమెంత దూరము పోదలచినను వారుమాత్రము మనలను వదలలేదు. నన్ను చంపుదువు- తరువాత నీవు చని పోవుట తథ్యము- తరువాత మనకై వీరు తపించుచుందురు. తొలుత వారలను ఖండించు- తరువాత మనకై విలపించువారెవ్వరూ ఉండరు- నైకోనుము- వారు నిద్ర మేల్కొనగలరు-

కృష్ణారావు బాకియ్యే యది గిరీశం చేతినుండి క్రింద బడును. టంగని శబ్దమగును-

హా- (సుశీల లేచి యరవ అందరు లేతురు)

గిరీశం! ఎంత పొరపాటు చేసితివి? సమయము దాటి పోయినది.

కృష్ణారావూ! నన్ను క్షమించు- కన్నులు గలిగి గ్రుడ్డి నాకు వెలుగు చూపించినావు.

గిరీశం! నాపై స్నేహభావముండిన ఛాయను విలపింప చేయకు- ఛాయా! నీ కష్టాలు తరించినవి- నీభర్త నీకై వచ్చి నాడు- సుఖసంసారము చేయుము.

కృష్ణరావూ! నా యభీష్టాన్నిగూడా నెరవేర్చు- సుశీలా దేవి యింక నీకై తపించకుండా జేయుము.

స్నేహితుని యభిప్రాయాన్ని తిరస్కరించగలనా!
మీ యిరువురి వివాహము జరుగలేదుగదా?
లేదు-
కృష్ణరావూ! రేపు మంచి ముహూర్తము-
సరే-



"దివ్యవాణి" పత్రికవారి
శ్రీనివాసా ప్రింటింగ్ వర్క్సు, సికింద్రాబాదు.